# వీరవల్లడు

విశ్వనాథ సత్యనారాయణ

దేశికవితామండలి

గవర్నరుపేట | ఘంటశాల
బెజవాడ | కృష్ణాజిల్లా

హక్కులు కర్తవి
వెల : రూపాయి

ప్రథమ ముద్రణ
మార్చి '45

సంపాదకులు :

బొందలపాటి శకుంతలా దేవి

,, శివరామకృష్ణ

భారతినుండి పునర్ముద్రితము

# అంకితము

—o—

కీ॥ శే॥ గొట్టెపాటి బాలకృష్ణమ్మకు

గీ. ఘంటశాలకు నీతాతగారివోలె
నేతవై నీవు పోల్చెడి గీతలేదు
నీకు, నభిమన్యుఁడే మేలు, నీవుగాని
యోయి! కార్యము జేపనఁ బోయినావు.

గీ. పూపమొగ్గ వయస్సునఁ బోవ నిన్ను
నేను జెప్పెదు నందాఁక నెఱుఁగలేరు
డొక్కలో దూరి తీవు కదుల్ శిశుఁబలెఁ
గుతిలపడియున్న నే నెఱుంగుదునుగాని.

మ. ఒక యే లోకములందు నీవరిగితో యోబాబు! నీవున్ భుజం
గకదష్టుండయి పోయినా వనిన దుఃఖంబింత నాగుండెమం
టకు క్రొత్తైనది నేడు కూడ నది కృష్ణామండలీరాజపీ
ఠిక మీకమ్మకులంబునన్ మణివహో ఒక్కంబునన్ రాలితే.

చ. పితృసుతభావయుగ్మమున భేదము చిత్రము నన్నుఁగన్నమ
త్పిత వదనంబు నా కనుల వేలదు పాతికయేండ్లుకాక, నీ
సుతునివలెన్ జరించు టొకచోద్యము, పాతికదాఁటి నీ సుధా
కృతవదనంబు కన్నులకు నెత్తినయారతివోలె నాడెడిన్.

గీ. తాను శ్రీపతివ్రతాలోక మాణిక్య
మప్పగారు పోయె నది మొదటిది
బిడ్డవంటి నీవు వెడలితి విది రెండు
తూఁగు నాదు జన్మదుఃఖసమితి.

క. ఈకథ పాతికయేండ్లుగ
నీ కంకిత మిత్తు నంచు నిలిపితి బాబూ!
నీ కిదిగో యంకితంబుగ
నీ కథ నాతండ్రి చెప్పె నెంతయు నారుఁగా.

క. నీవేమొ రైతుబిడ్డవు
నీ వల్లఁడు మంటిగడ్డ నెగసినవాఁడుఁగా
మావంశకథాదీపిక
నీ వస్మత్ప్రాణములను నిలుచు శిశువవుఁగా.

క. కృతి యంకితమ్ముఁ గొని యే
గతిఁబోదురు స్వర్గలోకకాంక్షులు నీ వా
గతిఁ బొమ్ము మత్సుధావా
గ్గతి సవీథీవిహారకల్పకము శిశూ!

విశ్వనాథ సత్యనారాయణ.

వాసుదేవప్రెస్, హైదరాబాద్.

# వీరవల్లడు

## ౧

అప్పటినించీ నే నిది కథగా వ్రాద్దామనే. అనుకున్నది యిరువది యేండ్లక్రింద. మా నాన్న నన్ను క్రొత్తగా బస్తీకి తీసికో-వెళ్ళి స్కూల్లో ప్రవేశపెట్టాడు. ఆ రోజున నే నొక క్లాసులోకి వెళ్లాను. నా కంతా క్రొత్తగానే ఉన్నది. మా ఊళ్ళో బళ్ళో ఒక్కడే పంతులు. ఆస్కూల్లో అదేమిటో! గంట గంటకీ పంతులు మారటం మొదలుపెట్టాడు. ఒకపంతులు నన్ను "నీ పేరేమిటి?" అని అడిగేడు. నేను 'వల్లప్ప' అని చెప్పేను. ఆమేష్టరు పగటివేషాలవాళ్ళు కళ్లు, ముక్కు త్రిప్పినట్లుగా త్రిప్పి "వల్లప్పా? కల్లకాడప్పా?" అన్నాడు. తక్కిన పిల్లలందరూ పెద్ద అల్లరి చేశారు. నాకు కోపమూ, దుఃఖమూ రెండూ వచ్చినవి. నేను పల్లెటూరువాణ్ణి. అందులో మాఊళ్ళో మేమంటే దొరలం. మాతాతగారినాటికి మాది చాలా పెద్ద ఆస్తి. మా తాతలిద్దరూ పంచుకున్నతర్వాత, మాతండ్రులు ముగ్గురూ పంచుకున్నతర్వాత మాకు సుక్షేత్రమైన మాగాణీ నలభై యెకరములున్నది. నలభై యెకరాలమాగాణీ అంటే సామాన్యమా యేమిటి? వాళ్ళ పుణ్యమాఅంటూ ఎప్పుడూ యుద్ధ మిట్లానే

ఉంటేనా, రెండులక్షల ఆస్తి అన్నమాట. అందులో పట్టణాల్లో ఉండే అనేకవిధాల భయాలులేవేమో. పల్లెటూళ్ళో పరాక్షిత్‌గా పెరిగేను. అప్పటికి కొంచెం మోటుగా ఉండేవాణ్ణి. "నాపేరు వల్లకాడేమి? నీపేరు వల్లకాడు" అన్నాను. ఆయన గ్రహించాడు. నవ్వి "నవ్వుతూ అన్నానోయి. పేరు బాగా లేదు" అన్నాడు. నాకప్పటికి పదునాలు గేండ్లు. అప్పటివరకూ బాగా ఉందనుకున్న నా పేరు అంతలో నాకూ బాగా లేదనిపించింది. ఇక పదిమాట లెందుకు? నాపేరు ఎప్పుడు క్లాసులో పిలిచినా అందరూ నవ్వటం, నేను సిగ్గుపడటం.

ఇల్లా మూడు నెలలు జరిగింది. ఎప్పుడు శెలవలు యిస్తారు, ఎప్పు డింటికి పోతాము, నాన్నతో చెప్పి పేరు ఎప్పుడు మార్చుకుంటాను అనే ఊహ. ఐదురూపాయిలతో పేరు మార్చుకోవచ్చుని అప్పుడు తెలియదు. పేరు మార్చుకోటం అంటే అనొక బ్రహ్మప్రళయమని. పేరెల్లా మారుతుంది. మనమొగం, ముక్కు, కళ్ళు, మన ఒంటిరంగు యివ్వన్నీ ఎట్లా మారవో పేరూ అల్లాగే మారదని. తరువాత మార్చుకోవచ్చుని తెలిసింది. మళ్ళీ తర్వాత మారదని తెలిసింది. మారితే పేరునుబట్టి జాతకాలెల్లామారుతై. పేరుమారితే జాతకాలు మారుతైఅంట్లారే.

సరే. యిదంతా ఎందుకు ? శలవ లిచ్చారు. ఇంటికి వెళ్ళాను. నేను కొత్తగా ఇంగ్లీషు చదువుతూ యింటికి వచ్చా నని మావాళ్ళకి నన్ను చూస్తే ఎవరో పెద్ద హైకోర్టుజడ్జిని నే నైనట్లే మావాళ్ళు సంతోషించారు. అప్పుడు తెలిసింది, నాకు యింగ్లీషు చదువంటే. మరి అంతగొప్పవాణ్ని వల్లప్ప ఏమిటి? మానాన్న అదీ యిదీ నన్నడుగుతూ ఉంటే నేను వాటి కేమీ సమాధానం చెప్పకుండా "నాన్నా, నాపేరు వల్లప్ప బాగా లేదు. మార్చుకోవా"లన్నాను. మా నాయనగారి నాయనమ్మ బాగా ఉంది. ఆవిడ,మానాయనమ్మ, మాఅమ్మ, మాఅప్పగార్లు అందరూఉన్నారు.మానాయనగారినాయనమ్మను మేము 'బామ్మా' అనేవాళ్ళము. మానాయనమ్మను 'మామ్మా' అంటాము. మా బామ్మ "ఇదేమి చదువురోయి. పేరు బాగా లేకపోవటం ఏమిట్రా ? ఎక్కడైనా పేరు బాగా లేకపోవడం ఉంటుందా ? పేరంటే పేరే. అందులో వల్లడన్న పేరే బాగా లేదూ. వీర వల్లడిముండ నువ్వేమి పనికొస్తావు ?" అన్నది. మా నాయన "నువ్వే బాగా లేదనుకున్నావా, ఎవరైనా అన్నారా ?" అన్నాడు. నేను "మామేష్టరు బాగా లేదు అన్నాడు" అన్నా.

మా మామ్మ "తలకు మాసినవాడు వాడెవడురా?" అన్నది. ఆ నిమిషంలో నా కదేమిటో 'వల్లప్ప' పేరు ఎందుకు బాగా లేదనుకున్నాను. బాగానే ఉందే అనిపించింది. మా

బామ్మ, మామ్మ, నాన్న అందరూ బాగానే ఉందనుకుంటు న్నారు. మా అమ్మ ఏమీ మాటాడలేదు. కాని వస్తూనే పేరుబాగాలేదన్నానుగా. అందుచేత ఆమాటమీదే కూచోని "మా మేష్టరంటే యమ్. ఏ. ప్యాసయినాడు. ఆయనకన్న మీ కెక్కువ తెలుసా? ఏమయినా సరే మార్చాల్సిందే" అన్నాను. మా బామ్మకు కోపం వచ్చింది. అన్నదికదా ... "నీవా పేరు మార్చుకుంటే నీతండ్రి ఆస్తి నీవు తింటానికి తగవు" అన్నది. మా నాయన నన్ను దగ్గరకు తీసికొని "బాబూ, నీకు తెలియదు. వల్లడు అన్నది చాలా మంచిపేరు. ఒక్కొక్కపేరు ఒక్కొక్కవిధంగా మంచిదోయి. కృష్ణుడు అన్న పేరు ఉంద నుకో. ఆపేరు మంచిది కాదని ఎవరూ అనరుకదా. ఎందుకు అనరు! కృష్ణుడు గొప్ప పనులు చేశాడు కనుక ఆపేరు అంద రికీ మంచిది అనిపిస్తుంది." అన్నాడు. నేను "అయితే కృష్ణుడు అని పెట్టుకుంటాను. వల్లడేమిటి" అన్నాను. మానాయన "అది కాదోయి. అందరి గొప్పతనం ఒకవిధంగా వుంటుందా? కృష్ణుని గొప్పతనం కృష్ణునిది." అన్నాడు. నేను "వల్లడెవరు?" అన్నాను. ఆయన "వల్లడా?" అని కొంచెము సేపాగి మళ్ళీ యిల్లా అన్నాడు: "వల్లడు మా తాతగారి పాలేరు. మా నాన్నకుగూడా పాలేరే. నాకూ పాలేరే. చచ్చిపోయినాడుగాని నీకూ పాలేరే. వాడు మాలవాడు. వాడు మన పాలేరు.

వాడి పేరు నీకు పెట్టాము. మానాన్నే నా కాపేరు పెట్టలేదని అప్పుడప్పు డనిపించేది. అందుచేతనే నా పేరు నీకు పెట్టాను." అన్నాడు. నా కేమీ తోచింది కాదు. అప్పుడు నాకు మానాన్న అన్న యీ మాటలలో లోతు తెలుసుకొనే వయస్సు లే దనుకుంటా. అన్నానుకదా— "మాలవాని పేరైతే నా కసలు అక్కరలే" దని. అనటంతోటే మా బామ్మ, మాఅమ్మ యిద్దరూ నా వంక కళ్ళు ఉరిమి చూచారు. వాళ్ళిద్దరికీ నేనంటే పట్టరానంత అపేక్ష. ఇదేమిటిరా బాబూ అనిపించింది. మా బామ్మ మా నాన్నతో అన్నదికదా "ఒరేయి, వీడిని చదువు మానిపించేశెయ్యి" అని. అనేటప్పటికే నాకు కళ్ళనీళ్ళు గిఱ్ఱున తిరిగినై. మా అమ్మ నన్ను దగ్గరకు తీసికొని నా కన్నీళ్ళు తుడిచి మానాన్నవంక కోపంగా చూస్తూ యిట్లా అన్నది: "వాడు పసివాడు. వాడి కేమీ తెలియదాయె. మీరు వాడికి చెప్పరాదా" అని. మా నాన్న "ఎప్పుడూ ప్రసక్తి రాలేదు. చెప్పలేదు. వాడిదే తప్పేమిటి? వల్లడి విషయంలో చిన్నప్పుడు నేనూ తప్పు చేశాను. నాకడుపున పుట్టాడు కనక వాడూ చేస్తున్నాడు" అని "రాత్రికిచెప్తాను" అని ఏదో పనిమీద వెళ్ళిపోయినాడు.

ఆరాత్రి మా నాయన చెప్పిన కథ.

ఆరాత్రి వెన్నెల. వాకిట్లో మంచాలు వేసుకొని పడు

కున్నాము. మా వాకిలిముందరే పశువుల సావడి ఉంది. అందులో గేదెలు, ఆవులు కట్టేసిఉన్నై. ఎడ్ల జతకూడా ఒకటి ఉంది. పశువులు పడుకొని బుస్సలు కొడుతున్నై. అవి గేదెలు అని తెలుస్తూనే ఉంది. ఎడ్లు గాట్లో ఉన్న గడ్డిపరకలు ఒకటో రెండో లాగుతూ నమలుతున్నై. బుస్సలు కొట్టేవి గేదెలని, మేసేవి ఎడ్లని చూడకుండానే మాకు తెలుసు. మా నాన్నను "కథ చెప్తానన్నావుకదా, చెప్పు"మన్నా. మా నాయన యిట్లా మొదలుపెట్టాడు.

*    *    *

నాకూ అప్పటికి నీయీడే ఉంటుంది. ఒక రోజున ప్రొద్దున వాకిట్లో కూచోని ముఖం కడుగుతున్నా. ఇంకా బాగా తెల్లవారలేదు. మా నాయనమ్మ వాకిట్లో ముగ్గు వేస్తూంది. మా నాయనగారింకా నిద్రలేవలేదు. నేను రోజూ ప్రొద్దున్నే లేవటంఅలవాటు. బామ్మ నన్ను తెల్లవారుకడనే లేపి తొందరగా ముఖం కడిగించి మజ్జిగచేసి రోజూ యింత వెన్న పూసపెట్టేది. నేను వాకిట్లోకూచోని ముఖం కడుగుతున్నానని చెప్పానుకదా. అప్పుడు వల్లడు గబగబా వచ్చాడు కేక లేసుకుంటూ వచ్చాడు. ఎవరిమీద నుకుంటున్నావు? మా నాయన మీద.

మొట్టమొదట వల్లడంటే ఎల్లా ఉంటాడో చెప్తాను

విను. ఆజానుబాహువైన మనిషి. చామనచాయ. వాడికళ్ళు, మొగం కొట్టవచ్చేటట్టు ఉంటై. వాణ్ణి పగలు జాము ప్రొద్దెక్కిం తర్వాత చూడాలి. పండునీరుకావిధోవతీ కట్టి ఉత్తరీయం పైనవేసుకొని ముఖాన నిలువుబొట్టు పెట్టి, కోల్పుకఱ్ఱ చేత్తో పట్టుకొని చెప్పులు తొడుక్కొని వాడు వస్తూవంటే, వాణ్ణి చూచి, ఎరక్కపోతే, మాలవాడని ఎవరూ అనుకోరు. వానిలో ఎంత ఠీవి, ఎంత హోదా! మాలవాడనటంతోటే పల్లెటూళ్ళల్లో వాణ్ణి సులభంగా ఏది పడితే అది అంటూవుంటారు. కాని ఊరి మొత్తమ్మీద ఎవ్వరూ వాణ్ణితిట్టటానికి సాహసించేవారు కాదు. పైగా ఏమైనా వ్యవహారాలు వస్తే వాడిని మధ్యవర్తిగా పిలిచేవారు. ఊళ్ళో వాడొక పంచాయతీదారు. వాడినిచూస్తే కమ్మో, రెడ్డో, కాపో అనుకోవాలి. ఆరోజున కేకలు వేసుకుంటూ వచ్చాడు.

"ఏమయ్యోయి, దొరల్లె పడుకున్నావు కాబోలు! మంచం పట్టుకుంటే వదల్లేవు. కుప్ప దూసుకోపోయారు ఎవళ్ళో. నేనేమో పెద్దముండాకొడుకును. అక్కరకు వచ్చావు దొరవులంటే నీవేమో కోడలమ్మను కావలించుకొని కూచోటంతప్ప యిల్లు కదలవు. నేను చచ్చింతర్వాత తెలుస్తై నీపాట్లు" అని యీ ఘోర [illegible]శిలో అన్నాడు.

మా పల్లెటూరి [illegible]ళ్ళ మాటలు మోటుగా ఉంటై.

నీ వింగ్లీషు చదువుకుంటున్నావు. నీ కవన్నీ చెప్పడం ఎందుకు? వాడి ఆ మోటు మాటలు పల్లెటూరిలో సహజమైనా నాకు కోపం వచ్చింది. మా నాయనేమో పెద్దరైతు. వాడు మా పాలేరు. అందులో మాలవాడు. నాకు కోపంవచ్చి వాణ్ని బూతులు తిట్టాను. "నీకు ఒళ్లూ పై తెలియటంలేదు. ఎవరినిరా నీ వనేది? దొరనేనా? దొక్క చీలుస్తాను......" ఏదో యీ ధోరణిలో అంటున్నాను. ఆ వల్లడి కేకలకే మా నాయన లేచాడు కాబోలు. వాడి కంఠస్వరం పుస్తకాలలో వ్రాస్తారే, మేఘగంభీరస్వనం. మా నాయన లేచి, కళ్ళు నులుముకుంటూ బయటకు వచ్చాడు. నేను వల్లణ్ని తిడుతున్నాను. ఆయన చూచాడు. చూచి తొందరపడుతూ "ఎవరినినా? ఎవరినిరా తిడుతున్నావు? వల్లణ్నే, వల్లణ్నే? ఓరి బుద్ధిలేనివాడా! వల్ల డెవరనుకున్నావురా" అన్నాడు. నేను "కాదునాన్నా, వాడు నీవంటే లెక్కలేకుండా మాట్లాడుతున్నాడు. వానికి ఒళ్ళు పొగరెక్కింది" అన్నాను. అంత మా నాయన "ఛా, నోరు మూయి. వల్లడు నన్ను ఏమి అంటానికి అధికారం లేదురా వాడికి? నన్ను వల్లడ నకపోతే యింక ఎవ డంటాడురా?" అన్నాడు. నా కింకా కోపం వచ్చి "నీ వలుసు యిస్తున్నావు. అల్లాగు యిల్లాగు" అన్నాను. మా నాయనగారు నన్ను కొట్టవచ్చాడు వల్లడు. ఆపాటున "ఇదిగో, బుడ్డాణ్ణి కొట్టేవు.

కట్టుకాయి కేమి తెలుస్తుంది? రాత్రి ఎవళ్ళో కుప్ప దూసుక వెళ్లారు. నేను ఊళ్ళోలేను. వస్తూ కుప్పమీదుగా వచ్చాను. పది పనలపెట్టు దూసుక నులుచకపోయారు. నీవు కోడలమ్మను వదల లేకుండా ఉన్నావు. రా పోదాం." అన్నాడు.

అంతట మా నాయనా, వాడు వెళ్ళారు. నాకు ఒళ్ళు మండిపోతోంది. వాడు మాటిమాటికీ కోడలమ్మ అంటాడు. నేను పదునాలుగేళ్ల కొడుకు నుంటే మానాయన్ని వా డదేమిమాట. వాడు మాలవాడేమిటి? ఈ సంబంధం ఏమిటి? నాకేమీతోచక ఏడుస్తూన్నాను. ఇంతలో మా నాయనమ్మ వచ్చి నన్ను ఓదార్చటం మొదలు పెట్టింది. ఆమె యీ జరిగిందంతా చూస్తూనే ఉంది. ఆమె నన్ను ఓదార్చవస్తే నాకు పౌరషం వచ్చి "నన్ను నీవు ముట్టుకోవద్దు. మాలవాడు కోడలమ్మట, కౌగిలించుకొని పడుకోటంట. నాన్న ఊరుకున్నాడు. నీవు ఊరుకున్నావు. ఇంకో రైతే అయితే డొక్క చీల్చి జోలుకట్టడా" అన్నాను. మా నాయనమ్మ నన్ను ఓదారుస్తూ "వల్లడికే మనం అంటే ప్రేమలేదా, గౌరవం లేదా? నీకు మీ అమ్మా, మీనాన్నా పెద్ద వాళ్ళుగా కనుపిస్తున్నారుకాని వాడికి చిన్నవాళ్ళేను. వాడిచేతిమీదుగా మీనాన్నకు పెళ్లిచేశాడు. సంబంధం కుదుర్చుకోవచ్చింది వాడు. మీఅమ్మ అంటే వాడికి పసిపిల్లలే కనిపిస్తుంది నాయనా, వాడి కదోకముద్దు" అంది. నాలో ఉండే

అహంకారం ఏమీ చావలేదు. అవ్వాళ వెన్నపూస పెట్టుమని మా నాయనమ్మని అడగలేదు, నేను పడమటింటిలోకే పోలేదు. కొంతసేపు ఊరి వెంబడి తిరిగి, పొలాలకేసి పోయి తిరిగి మధ్యాహ్నం తిరిగివచ్చాను. మావాళ్ళంతా నిద్రపోతున్నారు. నేనే అన్నం పెట్టుకుతిన్నాను. మళ్లీ ఎవళ్ళకీ కనుపించకుండా వెళ్లి పోయినాను. రాత్రి ఎవళ్ళకీ కనుపించకుండా వచ్చి మంచంమీద ముసుగెట్టుకొని పడుకున్నాను. మా నాన్నకు రాత్రికి నాఅజ వచ్చింది. మామామ్మా, అమ్మా అందరూ వెతికేరు. చివరకు నేను పడుకున్న చోటికి వచ్చి చూచారు. నన్ను బతిమాలి, బామాలి, అన్నం తినమన్నారు. నేను "వల్లణ్ణి పాలేరుతనం లోంచి తీసేస్తేగాని తినను." అన్నాను. అంతవరకూ బతిమాలిన మా నాన్నా, మామ్మా "పో వెధవా, నీవు తినకపోతే మానే" అన్నారు. నే నేంచెయ్యను. చివరకు గతిలేక నేనే అన్నానికి వెళ్ళాను. నేను అన్నం తింటూ ఉండగా మా నాన్న వచ్చి దగ్గర కూచోని అన్నం పెట్టటం మొదలు పెట్టాడు. మజ్జిగ కాడికి వచ్చేటప్పటికి రాజీ కుదిరింది. మజ్జిగ అన్నం ముద్ద నానోట్లో పెట్టవచ్చేటప్పటికి నేను మళ్ళీ కొంచెం రాచరికపు ఔత్తు లేవతీశాను. "నీవు నాకు అన్నం పెట్టనక్కర లేదు. నీకు నేనంటే కన్న వల్లడంటేనే అంత ప్రేమ ఐతే వాడికే పోయి అన్నం పెట్టు" అన్నాను. అప్పుడు మానాన్న "నీవు

మా బంగారుతండ్రివి, మానాయనవు. వల్లడు మాపాలేరు. నా నా ప్రాణదాత. నీవు నాతలపుళ్ళు కడిగి రక్షించేవాడివి. నీవు నాకు ఉత్తరగతులు కల్పించేవాడివి. వల్లడు నన్ను నిలబెట్టినవాడు మన కులదేవత. వల్లడంటే నాకు గౌరవం. నీవంటే ప్రేమ నాయనా. అటు వల్లణ్ణీ ఒదిలిపెట్టలేను. యిటు నిన్నూ ఒదిలిపెట్టలేను. ఈ మజ్జిగా అన్నం తిను. వల్లడు మనకేమీ చేశాడో చెప్తాను. ఆ కథంతా చెప్పింతర్వాత కూడా నీవు వల్లణ్ణి పాలేరుగా తీసెయ్యమంటే తీసివేస్తాను. వల్లణ్ణి నేను పాలేరుగా తీసివేస్తే వాడు యీవూళ్ళో ఉండడు. ఏకాశీయో లేచి పోతాడు. వాణ్ణి ఒదిలి నేనుమాత్రం ఉంటానా ? నేనూ వాడి తోనే వెళ్ళిపోతాను. రెండువందల యెకరాల సుక్షేత్రమైన మాగాణీ ఉంది. నీకూయీడు వస్తోంది. నా కాలి చెప్పు నీ కాలికి సరిపోతోంది. నీపాలం అంతా నీవే చేసుకోవచ్చు. వాడూ నేనూ కాశీకో, ఎక్కడికో పోతాము" అన్నాడు. నేను మా నాన్నను బతిమాలి ఆ మజ్జిగా అన్నం ముద్ద నోట్లో పెట్టించుకోవలసి వచ్చింది.

ఆరోజురాత్రి యివ్వాళకి మల్లేనే వెన్నెల. నీకుమల్లేనే నేను వింటున్నాను. నాకుమల్లేనే మానాన్న యిల్లా చెప్పాడు.

## ౨

అసలు నీ కీకథ చెప్పటం మొదలు పెట్టకముందు మన వంశం విషయం కొంత చెపితేనే కాని సరిగా తెలియదు. మన పూర్వులు మునుపు కృష్ణ అవతల ఉండేవారు. అక్కడ ఉన్న పొలాలన్నీ కృష్ణమ్మతల్లి తినివేసింది. బ్రతకటం కష్టమై, యీ ఊళ్ళో వచ్చి ఉన్న మూలపురుషుడు మరి ఎక్కడైనా పోయి బ్రతకవలెనని బయలుదేరేడట. ఆయనకు చుట్టకాల్చటం అలవాటు. మొదటినుంచీ మన్ను పిసుక్కొని బ్రతకటం అలవాటైన వాళ్ళం కనక బ్రాహ్మణులమైనా మన వంశంలో చుట్ట కాల్చటం అనే దురాచారం కొందరు కొందరియందుంటూవచ్చింది. ఆయన అల్లాబయల్దేరివస్తూ, మన యీఊరున్న ప్రదేశం మీదుగా వెళ్తున్నాడట — ఈ దారిని పడి యింకేవో ఊరు పోదామని. అప్పుడు యిదంతా అడవి. మన యిల్లు కట్టినచోట పెద్దచింత చెట్టు ఉన్నదట. ఆ చెట్టులో తొఱ్ఱ ఉంది. ఈయ నాచెట్టు క్రింద కూర్చుండి సగం త్రాగిన చుట్ట ఆ తొఱ్ఱలో వదలిపెట్టి పోయినాడట. ఆ వెళ్ళిన పని చూసుకొని తిరిగి పదిరోజులకుమళ్ళీ వస్తూ మళ్ళీ ఆచెట్టుక్రిందే కూచున్నాడు. తీరా చూచేటప్పటికి ఆచుట్ట ఆరిపోలేదు. ఆ తొఱ్ఱ కొద్దిగా అ టుకొని నిప్పు ఉన్నది. ఆయన 'యీ స్థలం నిప్పు

ఉండేస్థలం. యిక్కడ ఊరుకట్టి. యిల్లు కట్టుకొని నివాసం చేద్దా' మనుకున్నాడు. అప్పుడు యీ అడవిచట్టాలు, అడవి లోంచి పుల్లతీసుకోపోతే శిక్ష వెయ్యటాలూ, యీలాంటివి లేవు. భూమి అంతా ప్రజలది; రాజుది కాదు. దున్నిన నేల మీద పన్నుమాత్రమే రాజుది. కాని ధాత్రితో రాజున కేమీ అవసరం లేదు. ఈ అడివి ఆరువందల యెకరాల మేరఉన్నది. ఈ ఆరువందల యెకరాల మేరా తనది అన్నాడు. ఈ చింత చెట్టుక్రింద ఒక చిన్న పాక వేసి పెళ్ళాం బిడ్డలను తీసుకోవచ్చి కాపురం పెట్టాడు.

అంతా అడవి. వెలగపళ్ళు, చింతగుంజు, రకరకాల ఆకు కూరలు అన్నీ సమృద్ధిగా ఉన్నవి. జొన్నలొక్కటే తక్కువ. ఒక ఎడ్లజతను తెచ్చాడు. కావలసినన్నీ జొన్నలు పండించు కుంటున్నాడు. సంసారయాత్ర చేస్తున్నాడు. కాని అడవిఅంతా కొట్టి ఆయకట్టంతా అదునులోకి తీసుకోరావాలి. తానొక్కడూ చేయలేడు. ఇట్లా ఉండగా ఒక రోజున యీ వల్లడి పూర్వుడు యీ అడవిలోంచి వెళ్తూ మన యింటికి వచ్చి 'ఆకలిగా ఉంది అన్నం పెట్ట'మన్నాడు. అయన అన్నపెట్టి చుట్టపొగాకిచ్చి "ఒరేయి, యిక్కడ ఊరుకడదామని ఉంది. ఈ అడవి అంతా కొట్టాలి. నీవు వస్తావా? నీవుకూడా ఒక చిన్న కొంప వేసుకొని యిక్కడే ఉందుగాని" అన్నాడు. వాడు "దొరా, కడుపునిండా

అన్నం పెట్టావు. నీమాట కాదనలేను. వస్తాను" అని నాల్గో రోజుకి వాడి పెళ్ళాంబిడ్డలను తీసికోవచ్చాడు. ఒకపూట వాడికి గుప్పెడు మెతుకులు పెట్టినందుకు వాని కృతజ్ఞత చూడు. కృతజ్ఞత అనే గుణం వల్లడి కులంలో పుట్టింది. ఆనాటిమొదలు యీనాటివరకు వల్లడి వంశపు నెత్తురిలో యీ దేవతాగుణం లేశమైనా చెదరలేదు. ఇద్దరూ కలసి అడవిలో చెట్లు కొట్టి బయలైనంతమేర జొన్నో, రాగో ఎదో పండించుకుంటూ కాల క్షేపం చేస్తూవచ్చారు. తరువాత కమ్మవారినీ యితరకులాల వారినీ తీసుకోవచ్చి వాళ్ళకు భాగాలు పెట్టి అడవి అంతా కొట్టించి, చివరకు ఊరు యేర్పాటైంది. దానితో మనకు అవస రం లేదు. మన కుటుంబాలుకూడా యీ రెండు మూడు వందల యేండ్లు పెద్దగా పెరుగలేదు. ఊళ్ళో తాతగారున్నా కీ- వారి కుటుంబం, మన కుటుంబం ఆయనా మానాన్నా తాతా సహోదరులు. ఆయనా ఆయనతమ్ముడు రెండు కుటుంబాలు. నేనూ నా తమ్ముడూ; మాతమ్ముడు వివాహం చేసికోనన్నాడు. కనక మనదీ, వాళ్ళదీ రెండే కుటుంబాలు. వాళ్ళూ మనమూ విడిపోయింతర్వాత వల్లడు 'పెద్దదొరవు నీదగ్గరే ఉంటా'నని మా తాతగారి దగ్గరే ఉన్నాడు.

ఎంత విడిపోయినా సమిష్టికుటుంబంగా నేడుంటూఉండే వాళ్ళం. పొలం అంతా కలిపి దున్నటం, కలిపి పండించటం,

కలిపి త్రొక్కించటం. నేనూ మా తమ్ముడూ చిన్న పిల్లలం. నా కొక ఎనిమిదేళ్లు ఉంటై. బాబాయి కో నాలుగేళ్ళు. అప్పుడు మా నాయనగారు చనిపోయినారు. ఊళ్ళో ఉన్న మన రెండో కుటుంబంలో అప్పటి పెద్దానాయన పేరు రాయుడు. రాయుడుగారు వయస్సుచేత మానాన్నకన్న పెద్దవాడు. మనకుదురు యిక్కడకు వచ్చి నాయనపెద్దకొడుకూ ఆయనపెద్దకొడుకూ యిల్లావచ్చిన సంతానం. ఊళ్ళో పెత్తందారీ, మంచీ చెడ్డా అన్ని అజమాయిషీలు పెద్దకొడుకునందే ఉండటం అలవాటుగా వచ్చినా, రాయుడుగారు వయసున పెద్దవాడవటంచేత ఆయనయందే మర్యాదపెట్టి మానాయనగారుంటూ ఉండేవారు. అందుచేత వ్యవసాయం పనులన్నీ యీ మూడువందల యెకరాలమీద— తక్కిన మూడువందలూ వారికీ వీరికీ యిచ్చి ఊళ్లో కుటుంబాలు యేర్పాటుచేశారుగా — రాయుడుగారే చేస్తూఉండేవారు. అంటే మా నాయనగారూ చేస్తూనే ఉండేవారు. పెద్దరికంమాత్రం ఆయనమీద ఉంచుతూ ఉండేవారు. కాని ఆయనకుమాత్రం మనసులో గుర్రుగా ఉంటూఉండేదిలే. వీళ్ళది పెద్దకుటుంబం ఏమిటి, ఈ ఊరిమీద వీళ్ళది అధికారం ఏమిటి అని. కాని మానాయనగారంటే మనస్సులో భయం. మా నాయనగారు వెళ్ళి "ఏమోయి బాబాయీ, యిల్లా చేశావు" అంటే "లేదురా నాయనా, లేదురా నాయనా"

అంటూ సర్దుకోపోయేవాడట. ఈ పరిస్థితుల్లో మానాయనగారు చచ్చిపోయినారు.

ఇదిట్లా ఉంచి, యింకోసంగతి చెపుతా విను. మా అమ్మ పుట్టింట్లు కృష్ణఅవతల. మీ అమ్మపుట్టిల్లూ కృష్ణఅవతలే. అక్కడనుంచి వచ్చారుకనుక మన కుటుంబాల్లో అమూలపురుషుడు దగ్గరనుంచీ సంబంధాలు చెడిపోకుండా ఆ మేనమామల పిల్లలనే చేసుకుంటూవచ్చారు. ఆ కృష్ణఅవతల అది సముద్రతీరం, అన్నీ చవిటిపర్రలు. ఏమీ పండేవి కావు. మనవా ళ్లెప్పుడూ వారికి చేతోడు వాతోడుగా ఉంటూఉండేవారు. ఇప్పటికి మల్లెనే చూస్తున్నావుగా — ఎప్పుడూ మామేనమామలూ మీ మేనమామలూవచ్చి నెలలతరబడి ఉంటూఉండేవారు. పైగా మనకదే అచ్చివస్తోంది. ఇల్లా మా నాయనగారు చనిపోయిం తర్వాత ఆ రాయుడుగారు మా అమ్మని చాలా యిబ్బందులు పెట్టారు. "ఇంట్లో గింజలు లేవు" అంటే "నాకేం తెలుసు" అనేవాడట. ఈవిడ ఊళ్ళో చాలా అప్పులు తేవటం, కోమటింటినుంచి అన్నీ అప్పుచేసి తీసికోరావటం. కోమటింట పద్దు పెరిగిన కొద్దీ వాళ్లూ యివ్వననటం. చివరకు వల్లడు అదరించి బెదరించి ఎక్కడోక్కడ ఓ బస్తా జొన్నలు తెస్తే అది ఒచ్చే పోయేవాళ్ళతో రెండు రోజులన్నా రాకపోవడం. దారిమార్గాన వెళ్తూంటే ఎంతమంది బ్రాహ్మలైనా మరెంతమంది యితరు

లైనా ఫలానావారిల్లని మరి మాయింటికే వస్తారు. రెండు మూడువందల యేళ్ళుగా యీ యింట్లో లేదన్న మాటలేదు. అప్పటికే మా అమ్మగారు గుండెదిటవైనమనిషి. కొంచెం నోరు కలది. ఏమైతేనేమి, రోజులు గడచిన కొద్దీ ఊళ్ళో ఉండటం కష్టమైంది. నాయకుడూ, మునసబూ, కరణం అందరినీ నాయుడుగారు ఆకట్టాడు. "పిల్లలను వేసుకొని పుట్టింటికి లేచిపోతుంది, ఆడదేమి చేస్తుంది" అని పన్నాగం ఎత్తాడు. ఊళ్లో అధికారులు తనకు అనుకూలంగా ఉన్నా, పిలిస్తే పలికే దిక్కులేదు. వల్లడి అధికారంగూడా సాగలేదు. చివర కోరోజున మాకుకూడా అన్నంలేకుండా వల్లడితో చెప్పకుండా మా అమ్మగారు పుట్టింటికి బయల్దేరి వెళ్ళిపోయిందిట. నాకు లీలగా జ్ఞాపకం ఉందికాని ఆవిషయాలేమీ సరిగా బొమ్మకట్టవు. కాసేపు నన్ను నడిపించీ కాసేపు తమ్ముణ్ణి నడిపించీ, ఒకప్పు డిద్దర్నీ చంకన వేసికొనీ ఆ ఊళ్లా ఆ ఊళ్లో వాళ్ళనీ వాళ్ళనీ అడిగి మాకు అన్నం పెట్టించి నానాకష్టములూ పడి చివరకు పుట్టింటికి చేరింది. ఆవిడ తోడపుట్టిన వాళ్ళూ అంత సామంతులు కారు. వ్యవహారనిష్ఠలేనివారు. అవునంటే అవునని నడుము కట్టుకొని వ్యవహారాలు సాగించేందుకు మనిషిలో అదొక పలుకు ఉండాలి. అది దేవుడు యిచ్చేదికాని తెచ్చిపెట్టుకుండేది కాదు. వాళ్ళూ పేదవాళ్ళు; బ్రాహ్మణవృత్తిలో ఉండేవారు. "నీవూ నీపిల్లలూ

సరే మాతోపాటు ఉండండి. కలోగంజో అలాగే త్రాగుదా" మన్నారు. కాని "అరే, అదేమిటి, నీఆస్తికి వాడెవరు?" అని కత్తికట్టే సామంతం లేనివారు.

రోజు లిట్లా గడుస్తూ ఉండగా యిక్కడ, ఇక చెప్ప బోయేదంతా వల్లడు చెప్పిన కథ. వల్లడంటున్నాడు—

నేనా ప్రొద్దున కోడికూసేపాళ లేచి పొలంపోయి చూసు కొని దొరయింటికి వెళ్ళాను. మా పెద్ద దొర-అంటే నేను-రోజూ వాకిట్లో పడుకుండేవాడు. ఆరోజున కనుపించలేదు. గొడ్ల సావిట్లో చూస్తేపాడి గేదెముందర కాని, ఎడ్లముందర కాని గడ్డిలేదు. తెల్లార్లూ మేతలేక అవి డొక్కలు లోతుకుపోయి నన్ను చూట్టంతోటే గేదెనాలిక వెడలబెట్టి అరిచింది. నేను గడ్డితీసి వేశాను. దొరసాన్ని ఎన్నిసార్లు పిలిచినా ప్రతి లేదు. తీరా చూస్తే యింటికి తాళం వేసిఉన్నది. ఇరుగుపొరుగువారం దరనీ పిలిచాను. అందరూ చెప్పారు. "మీదొరసాని నిన్న ప్రొద్దున్నే వెళ్ళిపోయిందిరా" అని. నేనావెనుక రెండురోజులూ ఊళ్ళో లేను, నాచెల్లెలిని అదేదోఊళ్లో యిచ్చాము. దానికి జబ్బుగా ఉందంటే చూట్టానికి వెళ్ళాను. నాకేమీ తోచింది కాదు. కోపం వచ్చి రాయుడ్ని తిట్టాను. "నాదొర ఆస్తి వేసుకు తినేందుకు వీడెవరు? చూడు ఏమి చేస్తానో, పిల్ల

ల్నీ తల్లినీ ఊళ్లోంచి వెళ్లకొడ్తాడా. ఈపూట తింటే ఆపూట లేకుండా వాళ్లని పస్తుపెట్టాడు. నాదొర బతికున్నప్పుడు కుక్కైన పేపల్లే ఉండేవాడు. ఏసుకు తిందామనుకుంటూన్నాడు కాబోలు. ఎట్టా తింటాడో చూస్తాను. మళ్ళీ నాదొరఆస్తి నాదొర కప్ప చెపుతాను. అప్పచెప్పకపోతే నా పేరు వల్లడు కాదు. నేను మాలవాడి కడుపున పుట్టలేదు" ఇల్లా అంటున్నాను. చుట్టూ మూగిన కమ్మవారూ వారూ ముసి ముసి నవ్వులు నవ్వేరేకాని ఏమీ మంచిగా లేరు. ఇంతలో ఊరి నాయకుడు వచ్చాడు. అతను ఒత్తి ఒత్తి మాటాట్టం మొదలు పెట్టాడు. అంతా చూచాను. మనకేమీ అనుకూలంగా లేదని తెలిసింది. కాని నేనంటే ఏదో కొంత భయం ఉంది. పైగా న్యాయం నాపక్షాన ఉంది. నేనేమి చేయటానికైనా చిన్న దొరలూ, దొరసానీ ఊళ్ళో ఉంటేకదా. లేకపోతే "నీదేమి ఉంది పో"మ్మంటారురు. వెళ్ళి వెంటనే దొరసాన్ని తీసికోరానా అనిపించింది. పొలాలన్నీ పంటమీద ఉన్నై. కొయ్యాలి, గూళ్ళు వెయ్యాలి, తొక్కించాలి. చేస్తేగాని కొత్తగింజ రాదు. పాతగింజ ఎక్కడా కనిపించటం లేదు.

ఇప్పుడే దొరసాన్నీ, పిల్లల్నీ తీసికోవస్తే వాళ్ళని బ్రతికించటం కష్టమౌతుంది. అనుకొని మాట్టాడకుండా యింటికి వెళ్ళిపోయినాను. పగలూ రాత్రీ యిదే ఊహ అనుకో. నేనను

కున్న పతకానికి ఊళ్ళో కాపుల్ని కరణాల్ని తిరగతీస్తేగాని కుదరదు. దానికి కొంతకాలం పడుతుంది ఇదంతా నెమ్మది మీద జరగాల్సిన పనికాని తొందరపడితే లాభం లేదు. ఆ రోజున బువ్వతిని పొలం పోయినాను. రాయుడుగారక్కడ కూచున్నాడు నే నాయనవంకే చూడకుండా ఏదో పనిచేస్తు న్నాను. కాని కన్ను ఆయనమీదే ఉంది. ఆయన నావంక కోపంగా చూస్తున్నాడు. ప్రొద్దున నే నన్నమాటలన్నీ యీాయ నకు తెలిసి ఉంటవనుకున్నాను. నన్ను ఆయన చూస్తే ఎల్లా ఉందంటే ఏం కదిలిస్తే ఏం మీాదపడుతుందో అనేట్టు ఉన్నా. "పులిమీాదికి దున్నా రాలేదు. దున్నమీాదికి పులీ పోలేదు"

ఇలా వల్లడు చెపుతూఉంటే మానాన్న యీా ప్రశ్న వేశాట్ట 'ఇందులో దున్న ఎవరు ? పులి ఎవరురా ?' అని. అప్పుడు వల్లడు "ఓయిదొరో, నీవు గడుసెక్కావు" అని మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు—

నాలుగైదు పొద్దుల్లో ఆ ఉమ్మరాం తగ్గింది. ఆయన దారిని ఆయనా, నాదారిని నేనూ పోతూ ఉండేవారం. ఈపని చెయ్యమని ఆయన నాతో చెప్పేవాడు కాదు. నాకు తోచిన పని, నా దొరచేలో పని నేను చేసుకుంటూ ఉండేవాణ్ని. కాని ఆయన కడుపులో కదులుతూనే ఉందిగా. అందుచేత ఏచిన్న

విషయం వచ్చినా పాలేళ్ళనందర్నీ కలిపి మందిమీద తిడుతూ ఉండేవాడు. ఒకరోజున మరీ ఒడ్డెగిలిపోయినాడు. "ఎదవ, ఎదవ, వీడట, వాడి దొరపొలం వాడి కిప్పిస్తాడట. వాడి దొర పొలం అంటూ ఎక్కడుందో చూస్తాను. సిగ్గులేక ఏముహాం పెట్టుకొస్తాడు యిక్కడికి" ఇల్లా తొలకరి వేశాడు. ఇంతకన్న ఎక్కువంటానికి నేనంటే ఆయనకీ దమ్ములు చాలవు. తప్పించుక ఎక్కిరించాలికదా అని ఊరుకున్నాను. అప్పటినుంచీ నాకూ రగుల్తోంది. ఇంక పది పదిహేను రోజులలో జొన్నగూళ్ళు కోడతాం. ఉలవా పెసరా మినుమూ అన్నీ తయారైనై. ఇహ ఊళ్లో నలుగుర్నీ పొగగట్టుకోవలసిన అవసరం కనపడ్డది. నేనంటే ఊళ్లో కొంత మంచిఉంది. మంచి అంటే ఎక్కడనుంచి వచ్చింది. దొరలు మిమ్మల్ని పట్టే వచ్చింది. మీరూ నేనూ యీగడ్డకు మొదటివారం. నేను పాలేరువాణ్ణి అయినా, దొరా, యీ వూళ్లో నీమాట ఎట్లాగో నామాట అలాగు. ఆమాటను మీ కోసమే ఉపయోగ పెడదా మనుకున్నా. అక్కణ్నించి మొదలు పెట్టాను. దొరా, నమ్మితే నమ్ము, నమ్మకపోతే నమ్మకపో. అప్పట్లో కంచముందర కూచుంటే నాకు కూడు సయించేది కాదు. నిద్దరపట్టేది కాదు. ఒక రోజున చచ్చి సర్గాన ఉన్న పెద్దదొర కల్లో కనిపించాడు, 'వల్లా' అని పిలిచాడు. పొలానికి రమ్మంటున్నాడని తలగుడ్డ, కఱ్ఱకోసం వెతకపోయినాను. మెలకువ

వచ్చింది. చూస్తే నాగుడిసిలో నే నున్నాను. నాభార్య 'ఏమిటి అల్లా లేచావు ?' అంది. దాంతో చెప్పాను – 'దొర వచ్చి పిలిచేడు' అని. మేము భార్యభర్త లిద్దరమూ యింత సేపు కడుపుమంట వలుకపోసుకున్నాము. దొర చచ్చిపోయి నాడు. కడుపునిండా కూడు లేదు. కంటినిండా నిద్ర లేదు. కప్పు కోటానికి మసిపాత లేదు. రాయుడుగారిని సాధిస్తాను. మళ్ళీ నాదొర యింట్లో దీపం పెడతా.

# 3

ఆపగ కడవం బెట్టెను-ఓపి శుభంబైనదాని నొడగూర్పను మాం-కీపుట్టువునను పాండు-క్ష్మాపాలుడు నిన్నుచూపి చనియె మహాత్మా.

అనే పద్యము చదువుతున్నాడు మునసబుగారు. ఇంకా సరిగా తెల్లవారలేదు. ఆయనభార్య వెంకాయమ్మగారు వాకిట్లో ముగ్గులు పెడుతోంది. ఆయన అప్పుడే ముఖం కడుక్కున్నాడు. ఆ కనపడీ కనపడని వెలుగులో అద్దం చూచుకొని నామం పెట్టుకుంటున్నాడు. వారు కమ్మవారు. ఆయన ప్రతిదినం తెల్లవారక ముందే లేచి కాలకృత్యాలు తీర్చుకొని వీధిఅరుగుమీద గడపమొగదల కూర్చుండి దంత ధావన చేసి, రోజూ, తిరుమణి తిరుచూర్ణాలు దిద్దుచూ భాగవతంలోవీ, భారతంలోవీ పద్యాలు చదువుతూంటాడు. ఆవేళకు నేను అక్కడికి వెళ్ళాను. నేనూ అప్పటికే లేచాను. మాందొరపాలం పదిరోజులైంది గూడేసి. నాలుగైదురోజుల్లో కొడదా మనుకుంటున్నాము. ఇంతలో సన్నగా నాకు కబురు తెలిసింది. మునసబుగారి ఆవుకి ఏదో దొమ్మ వేసింది. ఊళ్ళో ఏ పశువుకి జబ్బుచేసినా వైద్యం నేనో, గవల గూడెంలో వీరయ్యో. మునసబు రాయప్పగారి పక్షం చేరి నన్ను పిలుస్తాడో పిలవడో. వీరయ్య ఊళ్ళో లేడు.

నేనే ఏదో పని ఉన్నట్టు వారి వాకిటిముందుగా బయల్దేరాను. మునసబు కొంచెం నోటిదురుసువాడు. అయినా బోళావాడు. అట్టే పట్టుదల లేనివాడు. నేను కనబడితే ఎట్లాగూ పలకరిస్తా డని నాకు తెలుసు. అందులో ప్రొద్దున్నే భక్తిగా పద్యాలు చదువుతూండేవేళాయెను. అనుకున్నట్టుగానే "ఒరే, వల్లా, నువ్వేనా" అన్నాడు. "అవును తాతా" అన్నాను. మునసబు నాకన్న పద్దేళ్ళు చిన్నవాడు. నాకు మనుమడువరుస. "ఒరే, ఆవుకి దొమ్మచేసింది. ఆవును పోయి చూసి ఏదన్నా పోసిపో" అన్నాడు. నేను "తాతా, ఆ పద్యం మళ్ళీ చదువు"అన్నాను. ఆయన మళ్ళీ చదివేడు. చదివి "అని కృష్ణభగవానుణ్ణి ధర్మ రాజయ్య అడిగేడు" అన్నాను నేను "నీవు కృష్ణమ్మ అంటి దొరవు"అన్నాడు. మునసబునకు చప్పున తెలియలేదు. నే నావుని చూశాను. నోరు తెరచి నాలిక వెలికలబెట్టి 'అంబా' అనలేకుండా ఉంది. పాడిఆవు. రోజూ మునసబు ఆవుమజ్జిగ గాని పోసుకోడు. ఆయనతల్లి ముసలావిడ, గానమ్మ, ఆవు నెయ్యిగాని పుచ్చుకోదు; ఆవుమజ్జిగగాని పోసుకోదు. ఇది తల్లికొడుకుల వ్రతం. ఆ ఆవుకి వెయ్యి ఉపచారాలు చేస్తారు. ఊళ్ళో వీరయ్య లేడు. నన్ను పిలవటానికి మొగ మాటం పడ్డాడు. నే నావును చూస్తూంటే గానమ్మ వచ్చిం ది. "ఒరి వల్లా, మాయదారివాడా, ఎక్కడికి పోయావు, రెన్నా

ళ్ళపట్టె ఒట్టి సాంబారుమెతుకులు తింటున్నాం” అన్నది. మున్న బుగారి ముంగిటివసారాలో ఎప్పుడూ వెదురుగొట్టం చూరులో దూర్చిఉంటుంది. అది నేనే తీసి కంచల వెంట వెతికి మందాకు తెచ్చి పసరు పిండి గొట్టంలో పోసి ఆవుమెడసందిట్లో పట్టుకొని మందు నోట్లో పోశాను. “పరవాలేదు. ప్రొద్దు నడినెత్తికి తిరిగే టప్పటికి ఆవమ్మ మేతకు మళ్ళుతుం”దన్నాను. నే నావుకిచికిత్స చేస్తూంటే మున్నబు వచ్చి ప్రక్కనే నిలుచున్నాడు. గానమ్మ కొంచెం దూరంగా నిలుచుంది. మందు పోయటం అయిం తర్వాత మున్నబు అన్నాడుకదా, “ఒరే తాతా, నేను కిష్టమ్మ నన్నావుకదా. అంటే ఏమిటి?” అని. ఇంతలో గానమ్మగా రన్నది. “ఏరా వల్లా, నీవంటివాడవై మా దొరల్ని తీసుకో రాలేవా? ఆ రాయప్ప మాయం మాడిపోను, ఆడు పిల్లల్ని ఎళ్ళకొట్టాడు, నీవేమో పట్టించుకోకుండా ఉన్నావు. నాకొడుకు రాయప్ప పక్షం చేరాడు. ఇదంతా ఊరు బాగుపడేందుకు రాలేదులే. పిదపకాలం వచ్చింది. ఇంకా ధర్మం ఎక్కడ? నే చెబుతున్నాకదా. ఈఊరు పట్టపగలు తగలడుతుంది చూస్తూ ఉండు” అంది. నేను “ఆ ధర్మపురోజులు పోయి చాలా రోజు లైంది. ఊరిమున్నబు ధర్మం చెయ్యకపోతే మరెవ్వరు చేస్తారు! నేను ముప్పైఏళ్ళపట్టె చూస్తున్నాను. ఈ దొడ్లో గొడ్డుకి జబ్బు చేసి ఎరగను. అందులో పాడి ఆవుకి దొమ్మ వస్తుందా? పెద్ద

దొర ఉన్నప్పుడు—పెద్దదొర అంటే మున్సబు తండ్రి—ఈ ఇల్లు ఊరుకంతా సుఖంగా ఉండేది” అన్నాను. మున్సబు “ఒరే తాతా” అన్నాడు. నేను “బాబూ, బాబూ, క్షమించు ఏదో పెద్దముండాకొడుకుని అన్నాను” అనిఅన్నాను. అన్నాను వెళ్ళి పోతున్నాను. వెనకనుంచి గానమ్మగా రంటోంది: “ఒరే నాయనా, మన కిది క్షేమం కాదు. వీరడు కల్లా కపటం ఎరు గని ముండాకొడుకు. ఆ చచ్చిపోయిన బ్రాహ్మడు ధర్మరాజు. ఇది వాళ్ళ గడ్డ, వాళ్లది పెద్దకుండ. ఆడి పిల్లలు ఆలో లక్షణా అంటూ వెళ్ళారంటే ఈ ఊరుకి కొట్టి తీరుతుంది.”అని ఏమోమో అంటోంది. నాకు తెలుసు. ఇది చాలని. ఇంక కర ణము, నాయకుడు ఉన్నారు. మున్సబు ఎడ్డెం అంటే కరణం తెడ్డెం అంటాడు. కాని కరణానికి మాదొర చాలా చేశాడు. మునసబుని పట్టి కరణంకూడా తిరిగిపోతాడని నమ్మకంలేదు. ఆయనకు వేరే పాచిక వెయ్యాలి. అది నెమ్మదిమీందగాని కుదు రదు. ఈ లోపుగా నాయకుణ్ణి తిరగతీయాలి. నాయకుడు సాయబ్బు. అతనికి అరవై ఏళ్ళుంటవి. అతని కొక్కడే కొడుకు. పదేళ్ళవాడు. అతని పేరు శివేరు. ఈ నాయకుణ్ని మాఊరు తీసుకోవచ్చించి మా దొర. నాయకుడికీ యానాది గంగడికీ స్నేహం. పూర్వం ప్రతిపల్లెటూరికీ ఒక యానాదివాడో, చుండువాడో కాపలావుండేవారు. వాళ్లు ఉన్నాళ్లూ ఊళ్లో

దొంగతనం జరగటానికి వీలులేదు. చేస్తే వాళ్ళే చేసేవాళ్లు. చేసినా గుడ్డా, గోచీ, చెంబూ, తప్పేలా, కుంచెడో మానెడో జొన్నలూ యీలాంటి వెత్తుకపోయేవాళ్లుతప్ప దోచుకపోవటాలుండవు. ఆ సంగతి నీకు చెపుతానుగా. ఈ గంగడికి నే నంటే భయం. ఎందుకంటే గంగడు కన్నాన పోయి కన్నాన వస్తాడు. మన ఊరు చుట్టుపట్ల ముప్పై నలభై ఊళ్లల్లో ఉండే కాపలాల వాళ్లందరికీ వీడు నాయకుడు. వాడు చీకట్లో నేలమీద పడుకొని బల్లివలె చేతులుమీద పడి పరుగుల దూరమైనా కప్పగంతులుగా దాటిపోతాడు. కోలుపు కట్టనీడలో దాక్కుంటాడు. వాడిని బ్రహ్మదేవుడుపట్టుకోలేడు. వా డొకసారి ఒక కమ్మవారింట్లో కన్నం వేస్తూంటే, నేను వీధివెంట పోతున్నాను వాడు అలికిడి తగిలి బల్లివలె గోడకు అత్తుకున్నాడు. అత్తుకున్న దెక్కడ? వీధిగోడకు జేగురుపరదాలు పెడితే ఒక పరదాలో కలిసిపోయినాడు. అప్పుడు వాణ్ని కనిపెట్టడానికి కన్నుచాలదు దగ్గరకు పోయినామయ్యా. వాడు దూకితే పది గజాలు దూకిపోతాడు. వాణ్ని పట్టుకోటాని కొకటేమార్గం. నేను నుంచున్న వాణ్ని నుంచున్నట్టుగా వాడి దగ్గరకు కుప్పించి దూకేను. వాడి రెండుచేతులూ నా చేతుల్లో ఉన్నై. వాడు ఇనపతీగవంటి ముండాకొడుకు. ఆముదం పూసిన చువ్వకట్టల్లె జారిపోయేటంత సులువు తెలిసినవాడు. అల్లాంటివాడు నా పట్టు తప్పించుకోలేక

పోయినాడు. ఎట్లాగూ తప్పించుకోలేము కదా అని తెలిసి "వల్లయ్యా, ఇంక వదులు" అన్నాడు. నేను 'నువ్వా' అని వది లేను. అప్పటినుంచీ నేను గంగడిచేత ఏమి చేయించలేను? వాణ్ణి పిలిచి "ఏమయ్యా, ఇది నాయమేనా? మీా నాయకుడు రాయప్ప వెపు చేరాడు. మా దొరలూ దొరసానీ లేచిపోయి నారు. నీవ్వూ చూస్తున్నావుగా" అన్నాను. వాడు "మునసబు మన వైపేనా?" అన్నాడు. "ఆ. ఇవ్వాళనుంచీ మనవేపే" అన్నాను. గంగడు "ఐతే శివేరుసాయబూ మనవైపేను" అన్నాడు నేను "నీవుమాట్లాడి ఆయన్ని మనవైపు తిప్పాలి" అన్నాను. గంగడు "నీవు రేపు ప్రొద్దున రా. నీకు చెప్తానుగా" అన్నాడు. మరునాడు ప్రొద్దున నేను గంగడి గుడిశకు వెళ్ళాను. అక్కడ శివేరు సాయబు ఉన్నాడు. నాయకుడిట్లా అంటున్నాడు. "ఒకే గంగా, అది మా తాతయ్య థాళీ. అది మానాన్న వాడుకున్నాడు, నాకు ఇచ్చాడు. కొంపలో ఉన్న కుంచెడు జొన్నలూ తీసికుంటే తీసికున్నావు. ఆ చెంబు నాకిచ్చెసెయ్యి" అని. గంగడా రాత్రి నాయకుడింట్లో అవి ఎత్తుకో వచ్చాడు. గంగడు తొణక్కుండా బెణక్కుండా "నీ యింట్లో ఎవరూ దొంగతనం చెయ్యలేరన్నావే" అన్నాడు. నాయకుడు "అరే! నీవు చేస్తావని నాకేం తెల్సు. మరింకోడెవడైనా అయితే మట్టిలు విరగతీస్తాను. నీవు వస్తావనే నేను అనుకోలేదు."

అన్నాడు. గంగడు "నీకు కావలసివస్తే జొన్నలు తీసుకో. చెంబు నాకావాలి" అన్నాడు. నాయకుడు "మున్సబుతో చెపుతా" నన్నాడు. గంగడు "మున్సబుతో చెప్పేటట్టయితే చెంబుకూడా తీసికోపో. నీయింట్లో ఎవరూ దొంగతనం చేయలే రన్నావు. అందుచేత చేశాను. మునసబుతో చెప్పకుండేటట్టయితే రెండూ తీసుకపో. నాతో పందె మాడేవు. నీయింట్లో నేను దొంగతనం చేస్తేనే నడిగింది యిచ్చి నీవస్తువు నీవు తీసికెళ్ళా నన్నావు. కనక నే నడిగింది. యిచ్చేసి నీ తాతచెంబు తీసికెళ్లు" అన్నాడు. నాయకుడు "సరే, అడుగు ఏమడుగుతావో" అన్నాడు. గంగడు "నే నడిగేది ఏమీలేదు. వల్లడూ నేనూ ఒక పక్షం. నీవు మాపక్షాన ఉండాలి." అంటే నాయకుడు "రాయప్పగారి విషయమా? రాయప్ప పెద్దరైతు. ఆయనతో తకిలీఫ్ నాకెందుకు" అన్నాడు. నేను "రాయప్ప పెద్దరైతా. నాదొర పెద్దరైతా? నాదొర చచ్చిపోతే రాయప్ప మగ పెద్దరైతు ఐనాడు కాబోలు" అన్నాను. నాయకుడు "నన్నేమి చేయమంటావో చెప్పు". అన్నాడు. గంగడు కోపంకొద్దీ "నీ కంత యిష్టం లేకపోతే నీ చెంబు నీవే తీసుకెళ్ళు" అని చెంబు వాకిట్లో పడేశాడు. నాయకుడు నవ్వి "అరే, గంగా, ఏమిరా అంత పొగరు నీకు? నేను మీపక్షమే పో. చెంబు నీవే మాయింటికి తీసుకోరా" అని వెళ్లిపోయినాడు. గంగడు "యింక బెడిసిపోదులే. తాత చెంబు

కోసం అంత ఏడిచేవాడు న్యాయాన్ని వదలి ఎక్కడికి పోతాడు? అన్నాడు.

ఇంక కరణం ఉన్నాడు. కరణాన్ని ఎట్లా సాధించాలో తెలియలేదు. రాయప్ప, కరణం యిద్దరూ జందెపుపోగువాళ్ళు. కనక యిద్దరినీ విడతీయటం కష్టం. అయినా ముఖ్యంగా నాయకుడు నాపక్షం. అయితే కరణం నెమ్మదిగా నాపక్షం తిరుగుతాడులే అని ధైర్యం. కాని ఎత్తొకటివేసి చూద్దామనిపించింది. కరణంగారికి చెప్పుల జోళ్ళ సరదా ఒకటి ఉంది. డాగురేకులు పెట్టి, అద్దాలు పెట్టి, బనారసు కుంచెలుపెట్టి, కిర్రు ఉండేటట్టుగా పాదమంతా పూజలలో చేసిన చెప్పులుగాని తొడగరు ఆయన కదొక పోను. ప్రతి మూడునెలలకూ క్రొత్తజోడు కావాలి. మాదిగ సొబ్బడు వెట్టివాడు. వాడు ఏడాదికి మూడు జోళ్లూ కుట్టి యివ్వాలిసిందే. అందులో ఒక రోజు అటూ యిటూ కాకూడదు. ఆ మరునాడు క్రొత్తజోడు తొడిగే రోజు. సొబ్బడు జోడిచ్చాడు. దానికి చెవలల్లో ఆముదంపోసి ఉంగటాలకూ వారలకీ నువ్వులనూనె రాచి పాదం అంతా కొబ్బరినూనెపూసి వాకిట్లో ఎండపెట్టాడు. వారింటి ప్రక్కనే ఒక కమ్మవారి ముసలమ్మ ఉన్నది. ఆవిడకు అరవై ఏండ్లు. కరణంతో ఆడవాళ్లెవ్వరూ మాట్లాడరు. ఆవి డొక్కతే మాట్లాడుతుంది. ఆ మాట్లాటంలో ఎక బెకేలుగా మాట్లాడు

తుంది. ఆవిడ కాయన అల్లుడు వరస. ఆ వరసమీద పెట్టి ఆయన ఊళ్లో చేసిన తీర్పు లన్నిటినీ ఎత్తిపొడుస్తూంటుంది. ఆయన మరీ అన్యాయం చేస్తే ఊరంతా యాగీ చేస్తుంది. ఆవి డంటే ఆయనకు భయం. "నా కెవరన్నా భయం లేదుగాని అత్తా, నీవంటే భయం అమ్మా" అంటాడు. వాళ్ళ యిల్లూ వీళ్ళయిల్లూ ఆనుకొనే ఉంటవి. నే నామధ్యాహ్నం పూట అటు వెళ్తూంటే ఆవిడవాకిట్లో నిలుచుంది. ఆవిడ కెదురుగుండానే యీ చెప్పులు ఎండలో ఉన్నై. ఆవిడపేరు రంగమ్మగారు ఆవిడ మంచిమాటకారి. దారంబడే పోయేవాణ్ని నన్ను పలిచి "ఒరే వల్లా, కరణంగారి క్రొత్తచెప్పులు చూశావుట్రా" అంది. నేను "ఆయన కేమి ధర్మరా" అన్నాను. ఆవిడ పగలపడి నవ్వింది. నవ్వినావిడ ఊరుకోక కరణంగారు వాకిట్లో కూర్చొని వ్రాసుకుంటున్నాడు. ఆయనదగ్గరకు వెళ్ళి "అల్లుడూ అల్లుడూ విన్నావా వల్లడేమంటున్నాడో నేను కరణంగారి క్రొత్తచెప్పులు చూశావుట్రా అన్నాను. వీడి ఉప్పరాయి ముండ, ఆయనకేమి ధర్మరాజు అంటున్నాడు. ఆయనకేమి మహారాజు అనాలిగాని ధర్మరాజు అంటాడా? నీవు ధర్మరాజువా? నీవు ధర్మరాజున్నూ, రాయప్ప కృష్ణుడున్నూ" అన్నది. కరణంగారు అదేమి చిత్రమో నావంక కోపంగా చూట్టం మొదలుపెట్టాడు. నేను "దొరా, నే నట్లా అనలేదు. మహారాజో, ధర్మరాజో నాకేం తెలుసు,

ఏదో లోకసామెతగా అన్నాను" అన్నాను. రంగమ్మగారిల్లా అంది: "అవునయ్యా, రాయప్పని వెనకేసుకొని వాడి చిన్న దొరలని నీవు వుహ్లోంచి వెళ్ళకొట్టావు. వాడికి కోపం రాదా. ఉన్నమాటంటే ఉలుకెక్కువ"అని "నీకిది తగదు నువ్వా ఆ మునసబూ ఆ రాయప్పపక్షం చేరకపోతే యింత దూరం వస్తుందా. ఆ యిల్లాలు పాపం ఊర్లో ఉంటానికి వీలులేక యింత చీకటి నెత్తిన వేసుకపోయింది" అన్నది. కరణం "నాదేముందమ్మా. మునసబు ఊరుకున్నారు. మునసబుదికాని నాదేముంది? లెఖల్లో వాళ్ళ దొరపేరే ఉంది. వీళ్ళ దొరపేరుకొట్టేసి రాయప్పగారి పేరు వ్రాశానా ? ఎవరన్నా వచ్చి అడిగితే పొలం వాళ్ళది కాదంటానా?" అన్నాడు. రంగమ్మగారు గడుసరి. అన్నదికదా "ఎందు కంటావులే. వాళ్ళ దొర నిన్ను బాగు చేసిన చెయ్యటానికి ఆయన బ్రతికిఉన్నన్నాళ్లూ అన్నయ్యా అన్నయ్యా అని ఆయనవెంట నుండేవాడవు. నీవు ఆయనకు పుట్టెడు జొన్నలు బాకీపడితే పోనీ లేరా తమ్ముడూ అని వదిలిపెట్టాడు. నీ పొలం ఆయన ఉన్నన్నాళ్లూ ఆయనగొడ్లతో త్రొక్కించిపెట్టెవాడు. నీ కొకటి చేసి ఒకటి చేయలేదా ? మునసబుకీ నీకూ కక్షలొస్తే నిన్ను వెనకేసుకొని సాధించి పెట్టాడు. నీవు ఈ ఊరు సంసారంతో రాకముందు వారింట్లో పదేళ్ళు తిన్నావు. ఏమన్నా అంటే "ఎవడికోసం పెట్టెడు.

ఊరికి కరణం కావాలని నన్ను తెచ్చుకున్నాడు. ఈ అమిత్ర మధ్య నాకు ఆయన కాకపోతే మరెవ్వరు పెడతా"రంటావు. ఆ బ్రాహ్మలు ఈ వూరికి నిన్నే తీసుకొరావటమేమి? అందర్నీ తీసుకవచ్చారు. అందరికి తమ్ముళ్లకు చేసినట్లు చేశారా" అని మొదలుపెట్టింది. కరణం "పోవమ్మా, నీ గోల ఎప్పుడూ యిం తేను" అన్నాడు. రంగమ్మగారు "నీవు ఇట్లా అంటంకాదు. మళ్ళీ వీళ్ళ దొరని ఈవూరు తీసుకోవచ్చి నిలబెడతాను అంటే బాగుపడతావు చెపుతున్నాగా" అంది. ఇంతలో ఎక్కడిదో ఒక గొడ్డు వచ్చి బురదకాళ్ళతో ఆయన ఎండపెట్టిన క్రొత్త చెప్పులజత త్రొక్కిపోయింది. కరణంగారి ప్రాణం పైది పైన పోయింది. ఆయన ఆగేదెనీ, ఆగేదెకామందునీ వంద తిట్లు తిట్టేడు. రంగమ్మగారు ముసిముసి నవ్వులునవ్వుతూ కూర్చుంది. ఆ చెప్పులు నీళ్లతో కడిగితేగాని పనికిరావు. కడిగితే బిఱ్ఱబిగుస్తవి. చెప్పుల పొంకం చెడిపోయింది. రంగమ్మగారు కరణం కోపం చల్లారిం తర్వాత యిల్లా అంది: "నేను చెప్పలేదా, ఎదటివాడి మేలోర్వలేకపోతే మన సరదా మంట కలుస్తుందని" అన్నది. నాదారిని నేను వెళ్ళిపోయినాను. సొబ్బడికి పినతండ్రి కొడుకొక డున్నాడు. వాడిలాంటి చెప్పుల జతలు చేసి ఇతర ఊళ్ళు వెళ్లి కుంచెడికి మానెడికి అమ్మివస్తాడు. వాడిదగ్గర ఇంతకంటె మంచిజోడొకటి తయారులో ఉంది. నేను వాని

నడిగి ఆ జోడు కొన్నాను. మరునాడు ప్రొద్దున్నే ఆజోటితో కరణంగారింటికి వెళ్లాను. కరణంగారు వీథిలో నిలుచున్నాడు. ఉత్తరీయంలో చుట్టిన జోడు తీసి ఆయనకాళ్ళముందు వేశాను. ఆయన కెక్కడలేని ఆనందం వచ్చింది. "ఎక్కడ తెచ్చావురా ఈజోడు" అన్నాడు. నే "నెక్కడతెస్తే ఏమిబాబూ. మీకు బాగుంటే తీసికోండి" అన్నాను. ఆయన ముఖం ఆయనకన్నా నా పక్షాన ఉండిపోయినై. ఇల్లా ఊరు నావైపుకి తిరిగింది.

## ౪

ఆరోజున జొన్నగూడు నూరుస్తున్నాము. అందరూ బువ్వాలు తిని వచ్చారు. కొంచెము మబ్బువేసింది. చల్లగా ఉంది. ఎడ్లను బంతులుకట్టి తొక్కిస్తున్నాము. తొక్కిస్తూంటే పాలేళ్ళల్లో ఒకడుపదంమొదలుపెట్టాడు. అందరూఅందుకున్నారు పాడుతున్నారు. నా కెప్పుడూ పదం పాడే అలవాటులేదు. రాయప్పగారి పెద్ద పాలేరు ఉన్నాడు. వాడూ, రాయప్ప గారూ ఏమనుకున్నారో వాడు నాతో కాస్త ఎకసెక్కాలుగా మాట్లాట్టం మొదలు పెట్టేడు. నేను చూశాను, నేను మా గూడెంలో పెద్దవాణ్ణి. నన్ను తూలిమాట ఎవడూ అనడు. నన్ను కొంచెం గోప్యంగా చూస్తారు. వా డిట్లా మాట్లాడుతూంటే తక్కినవాళ్ళకు కొంచెం కోపంవచ్చింది. నేను తమాయించి ఊరుకున్నాను. శ్రుతిమించి . రాగాన పడుతోంది. వాళ్ళల్లో మా అప్పకొడుకున్నాడు. వాడు కొంకెపట్టుకొని కంకెలు లాగుతూన్నట్లుగా నటించి రాయప్పగారి పెద్దపాలేరు సీలమండలకు వేసి కొట్టేడు. వాడు కూలబడ్డాడు. అందరూ నవ్వేరు. వాడుతిరిగి మళ్ళీమా మేనల్లుణ్ణి కొట్టబోయినాడు. మావాడు వాడి కందకుండా పారిపోయి "ఏదో తగిలింది, నిన్నేమి కొట్టాలని కొట్టేనా?" అన్నాడు. ఇదంతా పెద్దరవధకింద దిగింది.

రాయప్పగారికి దాంతో తెలిసింది—మాలో మాకు తగాదాలు పెడితే తన పని ఏమీ సాగదని. ఈ తగవుతో నూర్పిడి కొంత సేపు సాగలేదు. ఆయన ఎన్ని కేకలు వేసినా బంతులు తోలే వాడు లేడు, కంకులు లాగేవాడు లేడు. పని అట్లాఆగిపోయి పంచాయితీలోకి దిగింది. చివరకు నలుగురు పాలేళ్ళూ కలిసి "ఒరేయి అబ్బాయి, వల్లడు మన కులంలో పెద్దవాడు. వాడంటే ఊరంతా కూడా మర్యాద. వాణ్ని పట్టుకొని నువ్విలా అంటూంటే మే మెవళ్ళం ఒప్పుకోము. పైగా నీవెంతసేపూ వాణ్ని ఆ మాటలూ, యీ మాటలూ అంటే వాడేమైనా పలికేడా? నీ మాటలే గాలికి పోయినై కాని. జాగా ఎరిగి బ్రతుకో" అన్నారు. పైగా "వాడికీ నీకూ పొత్తేమిటి? వాడిదొరలు పెద్దవాళ్ళవటంతోటే నువ్వీక్కడెట్లాగో వాళ్ళ పొలాల్లో వాళ్ళట్లాగ. ఇవ్వాళ ఆదొరలు పసివాళ్ళు గనుక ఇక్కడ ఈ దొర గారు చేయిస్తున్నారు పొలాలు. నువ్వు వాణ్ని కొట్టేవంటే, చెప్తున్నాము అబ్బాయి, మన గూడెం అంతా రెండు పక్షాలు అవుతుంది. సూది తీసుకోవెళ్ళి దూలాన గుచ్చుతున్నా"వని చీవాట్లు పెట్టేరు. వాడూ చప్పపడి ఊరుకున్నాడు. రాయప్పగారు కొంచెం మద్దతిచ్చాడు. "ఏరా, ఒళ్ళు, పొగరు లెక్కి కొట్టుకుంటున్నారు. గూడెంలో పక్షాలు పడ తయ్యా ఏం? ఊరనుకున్నారా మరేమనుకున్నారు? చమడా

లెక్కతీస్తాను. వల్లడేమి దొరా ఏమిరా ? కొంకె కాలికి తగులు తుందా ? వాడు కొట్టాలనే కొట్టేడు. చూడు వీణ్ణి ఏమిచేస్తానో. రేపు ఏరువాక పున్నమినాడు యీ వెధవను తీసివేస్తాను. వల్లడు మీ అందరికీ పెద్దవాడైతే వాడికి నాపాలేరు పెద్ద వాడు కాడా" అనిఏవో ఏవో జమురుకున్నాడు. సరి, అయిపో యింది. మరునాటి సాయంత్రానికి నూర్పిడి అంతా అయింది. తాలుకంకెలన్నీ లాగేసి పోగువేశాము. గింజంతా పోగుచేసి బండీ కళ్ళంలోకి లాగి దానిమీద తూర్పేత పోద్దామని నే నెక్కేను. రాయప్పగారు "నీవు దిగు, మా పాలేరు ఎక్కు తాడు" అన్నాడు. నేను దిగలేదు. కొంచెంసేపు నేను తూర్పేత పట్టాను. ఇంతలో గాలి ఆగిపోయింది. మళ్ళీ గాలితెర మళ్ళే టప్పటికి వాళ్ళ పాలేరే ఎక్కేడు. సరే, జొన్నలరాశి తయా రయింది. యింతలో ప్రొద్దు గూకింది. రాశిమీద కంకెలు కప్పేము. ఆరాత్రి నేనూ, వాళ్ళ పాలేరూ కాపలా పడు కున్నాము. వాళ్ళ పాలేరు పేరు సుబ్బడు. మేమిద్దరం కూడు తిని కళ్ళానికి వెళ్ళేము. రాయప్పగారు భోజనానికి వెళ్ళేడు. నిన్న మధ్యాహ్నంనుంచీ సుబ్బడు నాతో మాట్లాట్టం లేదు. అప్పుడు మేమిద్దరమే అక్కడున్నాము. సుబ్బ డిలా అన్నాడు. "మామా, నామీద నీకు కోపం వచ్చింది కామోలు. నా దొరకి ఆస్తి అంతా కాజేదామని పుట్టింది. నువ్వు పాలేరుగా

ఉంటం ఆయన కిష్టం లేదు. ఎట్టాగైనా చిల్లి ఖజ్జాలు పెట్టుకొని నిన్ను వెళ్ళకొడదామని చూస్తున్నాడు. నాతో చెప్పారు. నా కెందు కొచ్చింది. చూస్తే దీని మూలంగా మనలో మనకు చెడిపోయేట్టుంది. నేనేమీ పట్టించుకోను. దొరకనక అవును కా దన్నట్టుగా ఉంటాను. ఇంక నీ యిష్టం." అన్నాడు. మనస్సులో నన్ను వెళ్ళిపొమ్మని; సుబ్బడికి తెలుసు. వాడు అన్నాడుకదా "వల్లడు దెళ్తాడులే దొరా. నే నుంటాను" అని. అని నన్ను గోకేడు. సుబ్బడి పెళ్ళాం నీళ్ళాడే రాత్రిళ్ళు. నేను అన్నాను కదా —"ఒరేయి, నీ భార్య నీళ్ళాడే పొద్దులు. నీ వెళ్ళితేనే మంచిది. నేనే ఉంటాను" అన్నాను. సుబ్బడు బయల్దే రేడు. రాయప్పగారి కేమీ తోచిందికాదు. త్రిప్పుకొని అన్నాడు. "అది నీళ్ళాడితే నీవేమి చేస్తావురా? పురుడు పోస్తావా? సరే నీవూ ఉండు" అని. ఆయనకు నేను ఒక్కణ్ణే ఉంటే భయం కాబోలు. అట్లాగే పడుకున్నాం. సుబ్బడు గుఱ్ఱు పెట్టి నిద్దరోతున్నాడు. నాకు నిద్రపట్టలేదు. ఆయనకూ నిద్ర పట్టలేదు. గుఱ్ఱుకొయ్యాలు పొడిచేవేళకు ఆయన లేచి ఇంటికి పోయినాడు. కోమటి "మరునాడు సాయంత్రంగాని కొలగారా నికి వీల్లేదు" అన్నాడు. నడిరెత్తికి ప్రొద్దు తిరిగేదాకా రాశి రాశిగా నే ఉంది. ప్రొద్దు మళ్ళిం తర్వాత కోమటి రామయ్యా కుంచం చంకన పెట్టుకొని రాయప్పగారూ, అతనూ వచ్చేరు.

పురికొస, దబ్బనం, ఒట్టి సంచులు బండిమీద వేసుకొని నేను వచ్చాను. తన సంచులు తను తెచ్చాడు రాయప్ప. కొలగారం మొదలు పెడతారు. రాశిమీద కంకులన్నీ తీసి నూగంతా చేటలతో దులిపేము. రాశిచుట్టూ తిరిగీసి విఘ్నేశ్వరుణ్ణి చేసి దానిమీద పసపుకుంకుమ చల్లి రాశిలో దూర్చాము. రామయ్య కుంచం పుచ్చుకొని కూర్చున్నాడు. పాలేరు భాగం నేను తీసుకుంటేనేగాని 'లాభం' అని మొదలు పెట్టటానికి వీలులేదు. సుబ్బడు తటపటాయిస్తున్నాడు. వాడివంక రాయప్పగారు కోపంగా చూస్తున్నాడు. వాణ్ణి తీసుకోమని యిదివరకే చెప్పాడో, యిప్పుడే వాడు ముందుకువచ్చి తీసికోవాలని ఉద్దేశమో. నే నంతా చూస్తున్నాను. నాకు సామాన్యంగా కోపం రాదు. వచ్చినా ముందూ వెనకా ఆలోచించని ఒళ్ళు తెలియని శివం లేదు. ఇప్పు డాలోచి స్తే అప్పుడు నావొళ్ళు నాకు తెలియలేదని తోస్తుంది. నాకు లోపల మండిపోతూంది. నడుము బిగించాను. పళ్ళిక పుచ్చుకున్నాను. రాశిమీదికి వెళ్ళాను. పళ్ళిక పుచ్చుకొని పాలేరుభాగం పళ్ళికెడు జొన్నలు రాశిలోంచి తియ్యబోతున్నాను. రాయప్పగారు కూర్చున్నవాడు నామీదికి దూకి పళ్ళిక కాలితో తన్నేడు. నేను చెప్పేనుగా కోపం పట్ట రాకుండా ఉందని; ఉరిమిచూశాను. ఆయన ఎవడఃరా నువ్వు? నా కళ్ళం రాశిలో పళ్ళిక తీసేందుకు? సుబ్బా, నువ్వు పళ్ళిక

తీసుకో" అన్నాడు. నే నన్నాను కదా— "ఇది నా దొరపొలం. ఈపంట నా దొరది. నే నందులో పాలేరు భాగం తీసికొనే దే" అన్నాను. రాయప్పగారు "దొర ఎవ్వరు? నీ వెవ్వరు? నా పొలంలో అడుగెట్టావా బండకొయ్య వేయి స్తాను. నీ దొరసానీ. పిల్లలూ, నెత్తిన గుడ్డవేసుక వెళ్ళారు. ఇక్కడ ఎవరి అబ్బగాడి సొమ్మందని పళ్ళిక తీశావు? వెఱ్ఱి అక్కాయివేషాలు వేశావా పక్కటెముకలు విరగతన్నిస్తాను. పోయి నీ అబ్బగాడితో చెప్పుకో" అని పరవళ్ళు తొక్కుతు న్నాడు. నేను "నా దొరపొలమే లేదా? ఎట్లా లేదో చూస్తాను" అనేటప్పటికి "ఏమి చూస్తావురా ఏమి చూస్తావు? నీవు చూసేదే మిటి? చూస్తాడుట చూస్తాడు! ఏదీ చూడు" అన్నాడు. నేను "చూస్తాగా, చేసి చూపిస్తాను, ఇదిగో" అని పళ్ళిక పుచ్చు కొని మళ్ళీ త్రవ్వబోయినాను. రాయప్పగారు నామీద కలబ డ్డాడు. కొట్టలేదుగాని చేతోతోశాడు. నేను కలబడితే విరిచి పోగులు పెట్టేవాణ్ణే. కాని బ్రాహ్మడు. పెద్దరైతు. నేను వ్యవ హారం సాధించుకోవలసినవాణ్ణి. ఆయనకొట్టినా నేనూరుకున్నా నని ఊరు చెప్పుకోవాలి. అందుచేత ఊరుకొని, ఈకళ్ళంలోనేను కాకపోతేమరెవ్వడుపళ్ళికఎత్తుతాడోఎత్తమనుఅనినిలుచున్నాను. రాయప్పగారు సుబ్బడి వంక చూచి "తియ్యరా, పళ్ళిక తియ్య" మన్నాడు. సుబ్బడు కదలలేదు. వాడు ఎంత గద్దించినా కదలక

పోతే వాణ్ని "పిరికి వెధవా" అని తిట్టి తానే పల్లకనిండా జొన్నలు తీసి యివతలపెట్టి రామయ్యను కొలవమన్నాడు. రామయ్యా తట పటా యిస్తున్నాడు. నేను ఇలా అన్నాను. అదివరకు రాయప్ప గారిని ఎప్పుడూ ఎదురుగా తిట్టలేదు. 'దొరగారూ' అన్నాను గాని ఇంకో విధంగాపిలవలేదు. ఆరోజున ఏమన్నానో జ్ఞాపకం లేదు కాని ఈమోస్తరుగా అన్నట్లు జ్ఞాపకం. "నాదొర ఆస్తి నీవువేసుకొని తిందామని చూస్తున్నావు. నా గొంతుకలో ప్రాణం ఉండగా నిన్ను తిననివ్వను. ఈగడ్డకో నా పూర్వులూ వచ్చారు. నీపూర్వులూవచ్చారు. ఇక్కడికొచ్చినమొదటి కుటుం బాలు మీరూమేమూ. బ్రాహ్మలలో పెద్దకుండ మాదొరది. నా కులంలో పెద్దకుండ నాది. నా దొరతో చస్తేచస్తాను బతికితే బతుకుతాను. నాకొరకు మళ్లె ఊరు వదలి లేచైనా పోతాను, లేకపోతే నా దొరను తీసుకోవచ్చి ఈ పూళ్ళో నిలైనా తొక్కుతాను. నాపట్టు శివంగి పట్టనుకో. మాలవాడుకదా హూంష్ అంటే ఎగిరిపోతా డనుకుంటున్నావు. నేను నీ గుండెల్లో కూచుంటాను. నిన్ను సాధించాలంటే లక్ష విధాల సాధిస్తాను. నీ యిల్లు దోయిస్తాను. లక్ష చెయ్యగలుగు దును. కాని అవేవీ చెయ్యను. వ్యవహారంగానే సాధిస్తాను. ఇదిగో ప్రొద్దున్నే లేచిపోతున్నాను. నా దొరసానినీ చిన్న దొరలనూ తీసికోవస్తాము. వాళ్ళను తీసికొస్తేగాని గంజెడు నీరు

పుచ్చుకోను. ఇది ప్రతిజ్ఞ. అనుకో. ఊళ్లో రాముడి గుడి ఉంది. ఆ రాముడి పేరుపెట్టి శాపం పెడుతున్నా. సుబ్బడు ఆ పళ్ళి కెడు జొన్నలు తీసికెళ్ళాడా— సుబ్బడి పెళ్ళాం నిండు గర్భిణి. తొలి పొద్దో మలిపొద్దో నీరాడుతుంది. నేను నోటితో అనను ఏమి చేస్తాడో ఆ దేవుడుడే చేస్తాడు. సుబ్బడు పల్లికెడు ఎత్తేడా ఊరంతా రెండుపక్షా లైందన్నమాటే. ఊరంతా దెబ్బలాటలే కుప్పలు తగలెట్టుకోటాలే, దొంగతనాలే. రామరాజ్యం మల్లే ఉన్న ఊరు హిరణ్యాకశిపుడి రాజ్యం చేస్తాను. ఈ పంతం అంతా సుబ్బడితో. ఓయి బ్రాహ్మడా ఇది నీతో కాదు. నీతో వ్యవహారం చేస్తాను. మాలవాడుగా వ్యవహారం చేయలే డను కుంటున్నావు. చేసి చూపిస్తాను. మాలవాడి వ్యవహారానికీ బాపనాడి వ్యవహారానికీ భేదం చూపిస్తాను. వ్యవహారం చేయ టానికి అక్షరం ముక్కలు రావాలను కుంటున్నా వేమో. బుద్ధికీ అక్షరానికి ఏమీ సంబంధం లేదు. సంబంధం లేదని మాదొర వెయ్యిసార్లు చెప్పాడు. మాదొర ఉన్న న్నాళ్లూ ఆయన మోచేతి వెనక దాగి ఉన్నావు. ఇవ్వాళ వీరుడవైనావు. ఈపొలం అంతా నాదొర తొక్కించకపోతే బంజరు అయేది. ఆయన వీధిలోనుంచొని అరిస్తే "నాయనా నాయనా అల్లా కాదురా"అని పిల్లిలా ఉండేవాడివి. ఇవ్వాళ కొమ్ము లొచ్చినై. నీకొమ్ము విరగతీయకపోతే నేను మాలాడి

కడుపున పుట్టలేదు." అని రివరివా బయల్దేరి వెళ్ళాను. నేనువె ళ్తాంటే అందరూ నావంక విస్తుపోయిచూస్తున్నారు. నేనువెనక్కి తిరిగి చూడలేదు. ఇంటికి పోవటానికి ప్రాణం ఒప్పలేదు. అట్లాగే బయలుదేరి మాదొరసాని పుట్టిల్లు ఊరుముఖం పట్టాను. వెళ్ళాను, వెళ్ళాను. ఆదారివెంట ఏమాలోచించానో నాకే తెలియలేదు. ఆలోచనే లేదు. ఒక కట్టె దారమ్మట నడుస్తున్నట్టుం దనుకోండి. ఆ ఊరు ఈ ఊరు దాటి వెళ్తాంటే "ఏ ఊరు మీ"దని ఎవరైనాఅడిగేరని గుర్తేతప్ప సమాధానం లేదు. "ఎక్కడికి పోతున్నావు?" అంటారు. ఎక్కడికి పోతున్నానని చెప్పను. అల్లాగే పోతున్నాను. రాత్రి ప్రొద్దోయింది. ఒక ఊళ్ళోంచి పోతూంటే నన్ను చూచి కుక్క మొరిగింది. రాయప్పమీది కోపమంతా నాకు దానిమీద వచ్చింది."నేనేమి ఎరుకలవాణ్ణా,యానాదివాణ్ణా,పాములవాణ్ణా నన్నుచూసి మొరుగుతుంది"అని దాన్ని కఱ్ఱతో కొట్టేటంత కోపం వచ్చింది. ఛీ,ఛీ రాయప్పనే కొట్టలేదు, దీన్ని కొట్టటం ఎందు కనిపించింది. ప్రొద్దునెప్పుడో తిన్నబువ్వ. కడుపులో ఆకలి మండిపోతోంది. ఎవరి నడిగినా ఇంత కూడు పెడతారు. నే నెవరినీ అడగతలచలేదు. ఎక్కడైనా పరుండి నిద్దరోతేగాని మళ్ళీ నడవలే నను కున్నాను. కూర్చోకుండా ముప్పై ఆమడైనా ఒక్క బిగువున పోయేవాణ్ణి-నా కారోజున ఆకలివెయ్యటం, కాలి నొప్పులు

పట్టటం నాకే చిత్రంగా ఉంది. ఎంచేతనబ్బా అనుకున్నాను. కోపం నాసత్తువంతా లాగివేసింది. కోపాన్ని తిట్టాను. మాదొర చెప్పేవాడు "ఒరేవల్లా, కోపం చాలా చెడ్డది" అని. నేనూ ఆయనా ఒకే యీడువాళ్ళం. నాకన్న కొంచెం చిన్నవాడనుకో. కులాలు భేదంగాని మేమిద్దరం చుట్టాలల్లే ఉండేవాళ్ళం. "ఒరే నాకు కూతురు పుడితే నీకు కొడుకు పుడితే వాళ్ళిద్దరికీ పెళ్ళిచేదాముర" అన్నాడోరోజున. ఆమాట నిజం కాదని ఆయనకూ తెలుసు, నాకూ తెలుసు. కాని ఒకళ్ళంటే ఒకళ్ళకు మాకల్లా ఉండేది. మా దొర చాలా చదువుకున్నవాడు. భారతాలు, భాగవతాలు చదివేశు. సంస్కృతం అదీ రాదు. కాని మా దొర మనస్సు, బంగారం. చదువెందుకు, బుద్ధి కావాలిగాని. మేమిద్దరం వయస్సుల్లో ఉండేవాళ్ళం అప్పుడు. మాదొర 'కోపం చెడ్డదిరా' అంటే నేను "కాదుదొరా, కోపాని కేమిటి, ఎట్లాగైనా చంపుకోవచ్చు. కామమే చెడ్డ" దన్నాను. మాదొర ఏమన్నాడు, రతనంవంటి మాట అన్నాడు. "ఒరే, కాదురావల్లా, కామ మేమున్నదిరా ముసలితనం వస్తె చస్తుంది. కోపం కట్టెల్లో పెట్టినా పోదురా" అన్నాడు. నాదొరా అప్ప టికి లేతవాడే. మా దొర ఆలోచన చూడండి. మా దొరా నూ, రాయప్పానూనా! అంత గొప్పవాడు కనకనే అంత పెంద రాడే చనిపోయినాడు. చెవల కింతింత బంగారపుముద్దలు పెటు

కొని ఎఱ్ఱగోర్పడాలు కప్పుకొని ఒగ్గుబ్రాహ్మలు మా దొరని చూట్టానికి వస్తె బస్తాలకు బస్తాలు కొలిచేవాడు మా దొర. ఆ దొరసంతానాన్ని నేను మళ్ళీ నిలపకపోతే నేను ఆదొరదగ్గర నేర్చుకున్న ఈ కోపం చంపటం, తక్కిన ఋణాలమాట అట్టా అట్టె పెట్టినా ఈఋణం ఎట్టా తీర్చటం? ఆకుక్కని ఏమీ చేయలేను. ఆఊరిచెరువుగట్టునో చెట్టుంటే ఆ చెట్టుక్రిందపడు కున్నాను. అప్పటికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది అంత ప్రొద్దుపోయి ఒక బ్రాహ్మణఅమ్మవారు చెఱువుకి నీళ్ళకు వచ్చింది. నే నా చెట్టుక్రింద పరుంటే "ఎవరా పడుకుందీ"అంది నేను "మేము మాలవాళ్ళం, మాది ఫలానా ఊరు"అన్నాను. ఆవిడ "అక్కడ పడుకున్నా వేమిరా, మా గొడ్లసావిట్లో పడు కుందుగాని రా" అన్నది. అని "అన్నం తిన్నావా" అన్నది. నేను అబద్ధం చెప్పేను. "తిన్నా నమ్మా"అని. ఎందుకంటే చీకట్లో ఆమె ముఖం కనబడలేదు. ఆమెగొంతుమాటే వినిపిం చింది. ఆ గొంతులో ఆమెకు యాభై ఏళ్లుంటై. దయ అంతా ఆగొంతులోనే ఉంది నా కన్నం పెడతా నంటుం దేమో. తినక తప్పక వస్తుందని తిన్నా నన్నాను. ఏఊరు పోతున్నా వన్నది చెప్పాను. ఎందుకన్నది. ఫలానాఆవిడ మా దొరసాని, ఫలానా ఆయన మా దొర అని నాకథఅంతా క్లొద్దిగాచెప్పేను. ఆవిడ "అయ్యో నీవువాళ్ళవాలేరువా? మీదొర ఏమిదొరరా.మా ఊళ్లో

పంటలు తక్కువ. మా మగవాళ్లందరూ యాచన చేసుకుంటూ ఉంటారు. ఎవరు చెప్పినా ఆయనపేరే. దాత అంటే ఆయనగాని యింకోరా అంటారు. నీ దొర శిబిచక్రవర్తిట. నీవు అన్నం తినలేదు. అబద్ధం చెపుతున్నావు. మా ఇంటికి రా. ప్రొద్దున్నే పిల్లలకోసం అన్నం అట్టే పెట్టాను. రేపు మళ్ళీ వాళ్ళకు వండి పెడతానులే. రమ్మ”ని నా ప్రాణం తీసింది. నేను పోయి వాళ్ళ గొడ్లసావిట్లో పరున్నాను. నేను ఎంతతిన్నానని చెప్పినా తింటే మళ్ళీ తినమని నా దుంప తెంచింది. చివరకి ఒక గుమ్మడాకులో పెట్టి ఇంత అన్నం, గోంగూరపచ్చడీ తీసికొచ్చి నాదగ్గర పెట్టింది. ఇంక నేను తప్పించుకోలేక “అమ్మా, చెరువుదగ్గిర తిని వస్తాను” అని బయల్దేరాను. ఈ అన్నం నేను తినటానికి తీసికోపోలేదు. అంత దయగల తల్లి మనస్సు కష్టపడుతుందేమోనని తీసుకోవచ్చాను. నన్ను చూచి మొరిగిన కుక్క అక్కడే ఉంది. నా చేతిలో అన్నం ఆకట్టిందల్లే ఉంది. నావెంట పడి వస్తున్నది. పెడతానో పెట్టనో తెలియని అన్నంకోసం అంత అనుసరించిందే ఆకుక్క. తరతరాలుగా మాదొరల కూడుతిని బ్రతికేను. నేనెంత చెయ్యాలి? ఆకుక్క అన్నం తింటూ వున్నంతసేపూ నేను నాలో నా దొరనీ,. ఆ కుక్కలో నన్నూ చూచుకున్నాను. ఆ రాత్రి ఆ బ్రాహ్మణఅమ్మవారి పంచాదిలో తల దాచుకున్నాను.

౫

నేను తెల్లవారకముందే లేచి బయలుదేరాను. ఆ రాత్రే బ్రాహ్మణ అమ్మవారితో చెప్పేను "అమ్మా, తెల్లవారకముందే లేచి పోతాను. మీతో చెప్పేందుకు మీరు అప్పటికి లేవరు" అని ప్రొద్దు పొడిచేవరకు చల్లగా ఉండి రాత్రి భోంచేయలేదని అనిపించలేదు గాని ప్రొద్దెక్కినకొద్దీ ఎండ చిత చితలాడి తల మాడ్చినకొద్దీ కడుపులో బాధకూడా ఎక్కువైంది. మాదొర అంటూఉండేవాడు "కలికాలంలో మనుష్యులు అన్నం లేకపోతే చచ్చిపోతా"రని. ఆ పూర్వకాలాల్లో కొన్నాళ్లు బొమికలున్నన్నాళ్ళు ప్రాణా లుండేవట; కొన్నాళ్ళు చర్మం ఉన్నన్నాళ్లు ఉండేవిట; కొన్నాళ్లు మాంసం ఉన్నన్నాళ్లు ఉండేవిట. ఇప్పుడన్నం ఉంటేనే ప్రాణం. నేను రాత్రి చెరువులో దిగి కాళ్ళు కడుక్కున్నాగాని నాల్గు దోసెళ్ళు నీళ్ళయినా పుచ్చుకున్నాకాను. ఎందుకు పుచ్చుకోవాలి? పుచ్చుకుంటే మాదొరసాని గారు రానంటుందేమో. కొంతదూరం నడచిన తర్వాత ఒక తంగేడుపుల్ల విరిచి నోట్లో పెట్టేను. అది నములటం, ఉమ్మేయటం, పళ్ళతోముకోటం అన్నమాట. ఇదొక కాలక్షేపంగా బయలుదేరేను. కృష్ణదగ్గరకు వెళ్ళేటప్పటికే రెండుజాములు కావస్తోంది. నా దొర బ్రతికి ఉన్నప్పుడు ఈవూ రెన్నిసార్లు

వచ్చానో. ఎప్పటికప్పుడే క్రొత్త. దూరాన్నించి ఆ కృష్ణకరకట్ట చూడగానే గుండెలో ఏమిటో క్రొత్తగా ఉంటుంది.మా ఊళ్లో ఒక కొండాలేదు, ఒక నదీలేదు. ఒక అడవీ లేదు, ఒక పెద్ద విశాలమైన స్థలమూ లేదు. అన్నీ చేలుకాడిగట్లు. చిన్నప్పటి నుంచీ అక్కడ పెరుగటం మూలంగా కాబోలు ఓ పెద్దనదినీ చూచినా, కొండను చూచినా, ఒక అడవిని చూచినా ప్రాణం ఏమో తేలిపోతుంది. కృష్ణకరకట్ట ఎక్కేను. ఎక్కిచూస్తే పెద్ద యిసుక. దూరాన పెద్ద నీటిప్రవాహం. అదివరకంతా మూసుకోఉన్న ఆకాశంఅల్లా ఒక్కసారిగా తెరుపుడుపడ్డట్టుగా, కుదించుకొని ఉన్న నేల బారలు వేసినట్లుగా, గుండె మనలోంచి వెళ్లిపోయి ఏదో పెద్ద గండభేరుండపక్షి అంత అయినట్లుగా విచిత్రమైన విప్పారటం చేస్తుంది. మావూళ్ళో చెరువునిండా నీళ్లు వస్తే తపకలుకొట్టుక్కొని కలకలలాడే నాచిన్న తనంలో మా ముసలి దొరగారి గొడ్లను ఆ చెరువులో దిగేసి వాటి వీపులమీాద కూచోని చెరువంతా ఈదులాడేవాణ్ణి. నేను మొదటిసారి ఈకృష్ణ చూచినప్పుడు మా ఊరి చెరువు లాంటి వెయ్యింటి నొక్కసారి చూచినట్లుంది. పంటరోజులు. అందుచేత కృష్ణ ఆఒడ్డూ యీ ఒడ్డూ తమూాయించిలేదు. ఒక అరకోసెడు మేర అంతా యిసక పారలేసిఉంది. కృష్ణపాయ అవతల ఒడ్డు నానుకొని ఉంటుంది. సముద్రానికి దగ్గరగనుక పాయ చాల లోతు. నేను పూర్వం

బళ్ళుకట్టుకొని ఈపూ రొచ్చినప్పుడు బండి ఇసకలమీద వదలిపెట్టి ఎడ్ల తలతాళ్లు పట్టుకొని ఏట్లో దిగేసి పడవమీద కూర్చొనిచాలా తడవలు వెళ్లేను. ఎన్నిసార్లు వెళ్లేనో అన్నిసార్లు ఈకృష్ణఅందం నా గుండెను తేల్చి వేస్తూనే ఉంది. మళ్లీ చూశాను. మళ్లీ అంతే. నాకిన్నేళ్లువచ్చినా అంతే. చచ్చేదాకా అంతే? ఏముందీకృష్ణలో, ఈఇసకలో, ఈ ప్రవాహంలో? నామనస్సు నామనస్సులో లేదే. నేను నేను కాదే. నామీద కొండంత పని బరువుందే. ఇప్పటికి ఈ ఊరుకాని ఇంత, నీళ్లు, ఇసక ఆకాశము చూస్తే ఏమిటి నామనస్సు పొందే అలజడి. నాగుండెని ఈశరీరములో విడిచి వేశారు. ఈగుండె ఈనేను అనుకునే ఈ కోరడి దాటిపోలేకుండా ఉంది కాబోలు. పోయి, ఇంత విశాలమైన ఆకాశంలో తిరుగు దామని దీని ఉద్దేశం. చిలకని పంజరంలో పెడితే- దాన్ని చాలరోజులు పంజరంలో ఉంచిన తర్వాత దానిని వదలిపెడితే, అది పల్టీలు కొడుతూ ఆకాశం అంతా తనదే నన్నట్టుగా, ఆకాశమే తను తనే ఆకాశం అన్నట్టుగా ఎగిరిపోతుందే. అల్లా ఉంటుంది నా గుండె; ఇంత కృష్ణను, ఇంత ఇసకను, ఇంత ఆకాశాన్ని చూస్తే. నేను ఈ సంతోషం అంతా పడుతూ నీటి ఒడ్డుకు వెళ్ళేసరికి ఎవరో బ్రాహ్మలు పడవలో ఉన్నారు. పడవవాడు మళ్లీ వస్తా నుండమన్నాడు. మళ్ళీ వచ్చేటప్పటికి రెండు గడియలు పడుతుంది. ఈ లోపుగా ముఖం తొలిచాను.

సరంగు ఈ సారి నన్నెక్కించుకున్నాడు. కొత్తముఖాలు కని పిస్తే వాడు కేవు అడుగుతాడు. నన్నడగలేదు. నేనిదివర కెన్నో సార్లు వెళ్ళేనుకదూ. మా దొర అతని కెన్నోసార్లు ఎన్నో ఇచ్చాడు. మా దొరసానిగారు పుట్టిన ఊరు కృష్ణకు అవతల ఒడ్డున అంటుకొనే ఉంది. ఊరిమొగతలే చెరువుంది. దొరసాని చెరువులో స్నానంచేసి బిందెతో నీళ్ళు పట్టుకొని ఇంటికి వెళ్తోంది. నన్ను చూడలేదు. నేను 'అమ్మా' అని పలక రించాను. ఆవిడ చూచి, నన్ను చూచిన తొందరలో పడ్డ తొట్రుపాటులో బిందెలో ఒక పావువంతు నీళ్ళు ఒంటినిండా వలకపోసుకుంది. "ఎందుకురా ఇలా వచ్చావు?" అంది. "మీకోసమే వచ్చాను. చెపుతాగా" అన్నాను. ఆవిడ నాతో మాట్లాడేనని ఆ బిందెడునీరు పారపోసి మళ్ళీస్నానంచేసి నీళ్ళు తెచ్చుకోపోయింది. మడిగట్టుకొని బ్రాహ్మలు మాతో మాట్లా డరుగా. మళ్ళీ స్నానం చెయ్యకముందామె అందికదా, "ఒరే వల్లా, నీమొగం చూస్తే రెన్నాళ్ళపట్టి భోజనం లేనట్లుంది. ఆదేమిరా ఏనుగంత ముండాకొడుకువి అలా అయిపోయినావు? మా మామగారు అంటే - రాయప్పగారు నీకూకూడా అన్నం పెట్టటం లేదా? ఇంటికిపద. దొరలున్నారు. నేనువస్తున్నాను" అన్నది. నేను వెళ్ళాను. వాకిట్లో మా చిన్నదొర ఎండలో కూచొని మన్నుతో ఆడుకుంటున్నాడు. నేను "బాబూ, మం

టిలో ఏమిటి? తే" అన్నాను. ఆయన మెడయిట్లావాల్చి నావంక చూచి "నీవొచ్చా వెందుకు?" అన్నాడు. నేను "ఒచ్చా గాని, అన్నయ్యే ఏడీ?" అన్నాను. ఆయన "అన్నయ్యను తీసుకోరానా." అని లోపలకు పోయి అన్నగారిని చెయిపట్టుకొని బలవంతంగా లాక్కొవస్తున్నాడు. నేను వచ్చానని చెప్పలేదు ఆయనకు మరీ చిన్నతనం అవటంమూలంగా మన పాలేరు అని గాని, వల్లడనిగాని చెప్పలేకపోయినాడేమో. ఎందుకు చెప్ప లేడు? ఈ నాలుగైదు నెలలబట్టీ నేను కనపట్టంలేదు కాబట్టి అదొక క్రొత్తగాఉంది. పాతపాతగా ఉండీ అందులో కొత్త పసితనం. గ్రుక్క త్రిప్పుకోలేని ఊహ, మళ్లీ నన్ను చూట్టంతోటే తన వాళ్లెవరో వచ్చారనుకోటం. ఈ చమత్కారం అంతా ఆ పసితనంలో ఉంది. అన్నగారు నన్ను చూట్టంతోటే "ఇందుకా? వల్లడొచ్చాడే అమ్మా" అమ్మా" అంటూ యింట్లోకి పరుగె త్తేడు. ఇంతలో దొడ్డిత్రోవ వెంట వాళ్ళమ్మగారింట్లోకి వచ్చింది. ఆమె తడిధోవతి విప్పి వేరే పొడిబట్ట కట్టుకొని తల్లీ కొడుకులు వాకిట్లోకి వచ్చేటప్పటికే ఒక గడియసేపు పట్టింది. అవిడ వస్తూనే అంది. "ఏవిరా వల్లడు" అంటూ. ఆ అనటంలో తాను నన్నంతకుపూర్వం చూడనట్లు, తన పెద్దబిడ్డే ముందర నన్ను చూచినట్టు. ఆపిల్లవాడి సంతోషం ఎందుకు చెడగొట్టా లని. మాదొరసానిగారి పేరు సర్వలక్షుమ్మగారు. ఆవిడ ఎంత

ఇల్లాలో, ఎంత మనిషో నేను చెప్పట మెందుకు? మా చుట్టు పట్ల పది ఊళ్ళకు తెలుసు. నేనల్లా ఆస్తి నిలబెట్టినవాణ్ని గాని ఆవిడ కొడుకుల్ని పెద్దవాళ్ళను చేసి సంబాళించి, మాదొర ఉన్నప్పు డెట్లాగో మళ్ళీ సంసారం ఇల్లాసాగించిన తల్లి. మాదొర ఉన్నన్నాళ్లూ దొరచాటున ఉండి, ఆవిడ తెలివితేటలు, ఆవిడ వ్యవహారపుతనం మాకే తెలియలేదు. నేనున్నా లేకపోయినా, ఆవిడే పొలమంతా చూచుకొని పిల్లల్ని బాగుచేసింది. ఆవిడ కఱ్ఱ చేత్తో పుచ్చుకొని కాడిగట్టున నిలచుంటే ఏ పాలేరు, ఏ కూలివాడు పాలుమాలడానికి వీలులేకుండా ఉండేది. ఆకొడుకుని అల్లా సంతోషపెట్టటంలో అదే మొదటిసారి మాదొరసానిఅంటే ఏమిటో నాకు తెలియటం. పసివాడైనకొడుకు సంతోషం చెడి పోతుందేమో నని అంత జాగ్రత్తగా మాట్లాడే దావిడ ఎంత నిద్రామనిషి కావలె. మా దొర ఉండగా అవిడమంచితనమే చూచాగాని ఆవిడలోనున్న ఈగుణం చూచానుకాను. అది కూడా వేళలో ఉంది. ఆవిడ వాళ్ళు బాగున్నారా, వీళ్ళు బాగున్నారా అని అడిగిం తర్వాత నన్ను అన్నం తినమన్నది. నిన్నటి చద్దిఅన్నం ఉన్నది, మజ్జిగపోసి పెడతానంది. నేను కథంతా చెప్పేను. "దొరసానమ్మగారూ, నీవూ పిల్లలూ వస్తే, వస్తానని మాట ఇస్తే నేను అన్నం తింటాను. లేకపోతే ఇక్కడే ఉపవాసం చేస్తాను. చచ్చిపోయిం తర్వాత కృష్ణలోకిఈడిపించు"

అన్నాను. ఆవిడ "ఒరేవల్లా, నే నాడదాన్ని. మామగారు సామంతుడు. వారు బ్రతికిఉన్నప్పుడు ఊరంతా ఆయన గీసిన గీతమీద నడిచింది. ఇప్పుడాయన్ను మరచిపోయింది. నాకక్కడ ఊరా పేరా? ఆరునెలలు గిద్దెడుగింజలు దొరక్క నానాతిప్పలూ పడ్డాను, పిల్లలనుకూడా చివరకు సాకుకోలేక పోయినాను. మళ్ళీ వచ్చి ఆ యిబ్బందులు పడి మళ్ళీ యిక్కడకు తిరిగి రావటమే కదా? ఎందుకు పట్టు పడతావు? పొలం పండించి ఆయన పోసి కొనే. మేమేం తింటాము, నీకేమి పెడతాము? ఏమి కానుందో అది అవుతుంది. రాతిలో కప్ప కాహార మాతతముగ నిడెడు దైవంబు మర్త్యుల కేల మాను" అన్నది. మా దొరసానిని చూచినకొలదీ, ఆవిడమాటలు విన్నకొద్దీ నా పట్టుదల మరీ వృద్ధిఅయింది. మాదొర మాట్లాడినట్లే మాట్లాడుతుంది. ఆ పద్య మెప్పుడూ మాదొర చదివేవాడు. మాదొరసాని చదువు కొన్నది కాదు. ఆ భర్త మాట్లాడుతూంటే ఆమాటలు, ఆ పద్యాలు అన్నీ ఆవిడ కొచ్చినవి. ఈ సంగతి తర్వాత తర్వాత నాకు మరీ తెలిసింది. ఆ దొరకు తగిన దొరసాని. ఇన్నాళ్ళూ ఈతల్లి మగనిచాటున ఉంది. ఈవిడ వ్యవహారం చెయ్యటం మొదలుపెడితే రాయప్పగా రేమి నిలుస్తాడు? అస లాయనకు మాటపొంది కేమితెలుసు? ఈమె నా దొరశిష్యురాలు. నేను అన్నానుకదా, "అమ్మా. ఊరు మునపటికి మల్లేనే ఉందను

కున్నావా? కరణము, మునసబు, నాయకుడూ అందరూ మన వైపు” అన్నాను. ఆవిడ ఆశ్చర్యపోయి “అవేమి మాటలురా? మనవేపువాళ్ళయితే నే నక్కడల్లా ఉంటే చూస్తూ ఊరు కుంటారా? ఆ ఊరు మీ దొరనాటి ఊరా? వాళ్ళ మన స్సులన్నీ అమ్ముడుపోయినై” అన్నది. నేను వేసిన పాచి కలు, ఎత్తిన ఎత్తుగడలు, అవిపాలిన వైనం అంతా చెప్పేను. ఆవిడకు కొంత నచ్చింది. “సరి. సరి. ఐతే చూద్దాంలే. నీవు ముందర భోజనంచేయ” మన్నది. “కాదు. దొరల్ని తీసుకొని మీరు వస్తానంటే భోజనం చేస్తాను” అన్నాను. ఆవిడ “మరి రావటంతోటే తిండీ తిప్పలూ ఎల్లాగురా? కోమటింట పద్దు ఇది వరకే పెరిగిఉంది. వెళ్లటంతోటే అతను అడుగుతాడు. చేసిన అప్పులన్నీ అలాగేఉన్నై. వెళ్ళటంతోటే వాళ్ళు అడుగుతారు. నీతో నాకు ముందర నుయ్యి వెనక గొయ్యిలా గుంది” అన్నది. నేను “నీ కాభయం లేదు. నీవు గడపలో అడుగు పెట్టటంతోటే పుట్టెడు జొన్నలు, పందుంజిలంవడ్లు తీసుకో వచ్చి నీయింట్లో వేస్తాను. కోమటికి రెండుబస్తాల జొన్నలు కొలు. నీఇంట్లో నీవుండు. ఇంక నేను రాయప్ప నాడిస్తాను చూడు. మన ఎడ్లనీ, మన పశువుల్నీ తీసుకొచ్చి మనసావట్లో కట్టివేస్తాను. కాదంటానికి రాయప్పకు తరంకాదు కదా” అన్నాను. అవిడ బాగా ఆలోచించింది. అప్పటి కింకా జాము

ప్రొద్దే ఉన్నది. చివరిమాట అన్నది. "ఓరి పిచ్చిముండా కొడుకా! నీ కెందుకురా ఈ బాదరబందీ అంతా? ఆ దొర కొడుకు లేమైపోతే నీకేమి? ఈ బలవద్విరోధం నీ కెందుకు నీవు అన్నం తినిపో" అని. నేను "నేను అన్నం తిని వెళ్ళటానికే అయితే యిక్కడి కెందుకు వస్తాను? దొరలను తీసికొవెళ్తాను. లేకపోతే నాపీనుగ యిక్కడే వెళ్ళిందనే పేరు నీకు దక్కాలి" అన్నాను. ఆవిడ అలాంటి మాట లెందుకు? వస్తానుగా. నీవు భోజనం చెయ్యి" అన్నది. నేను "అల్లా కాదు. నీవు వస్తానని ప్రమాణం చెయ్యి. లేకపోతే నేను భోజనం చెయ్య" నన్నాను ఆవిడ మొగం అంతా బిగించుకొని "సరే. ప్రమాణం చేస్తున్నాను. భోజనం చెయ్యి" అన్నది. అప్పటి ఆవిడమొగం చూస్తే అప్పు డావిడ నిశ్చయంచేసుకోటం కొడుకుల ఆస్తి. నిలబెట్టటంమాత్రమే కాని ఓ పెద్దరాజ్యం ఏర్పాటుచేద్దామని ఆవిడప్పు డనుకున్నా అంతపని చేసేవరకు నడుము విప్పదన్నట్లుగా ఉంది. ఆదొరసానిమొగం చూస్తే జరగబోయే పనంతా అప్పుడే జరిగినట్లున్నది. భోజనం చేశాను.

ఆరాత్రి సుఖంగా నిద్రపోయినాను. మరునాడు మా దొరసాని నాయనగారు పంచాంగం చూచి బాగానే ఉందన్నాడు. బయల్దేరి కృష్ణ దాటేము. కృష్ణ దాట్టంతోటే అక్కడో ఊరుంది. ఆఊళ్ళో ఓబండీ బాడుగకు కట్టించాను. రెండు

మాడ లిమ్మన్నాడు. సరే అని ఒప్పుకున్నాను. బండికి గుడిశ లేదన్నాడు. లేకపోతే మాడన్నరే యిస్తానన్నాను. ఆబండీ ఆయన అరమాడా ఎక్కడపోతుందో నని ఎక్కడో గుడిశ తెచ్చి కట్టాడు. మా పెద్దదొర ఎడ్లమెడలో గంటలూ, మువ్వలూ లేకపోతే తా నెక్కనన్నాడు. నేనూ అంతే నన్నాను. ఆవూళ్ళో మువ్వలపట్టెడ ఎక్కడా దొరకలేదు. దొరసాని పిల్లవాణ్ని కోప్పట్టం మొదలు పెట్టింది. నేను "మనం దొరలల్లే వెళుతు న్నాం. మువ్వలపట్టెడ లేకుండా ఎట్లా వెళుతాం" అన్నాను. మళ్ళీ కృష్ణదాటి మాదొరసాని పుట్టిన ఊరుపోయి ఊళ్ళో కను క్కొని ఎవరింట్లోనో అద్దాలుతాపిన మువ్వల పట్టెడ లుంటే తీసుకోవచ్చాను.

## ౬

ఈ ఆలస్యం మూలంగా బయలుదేరే వేళకు పొద్దు వాటారింది. మా పెద్దదొర బండిఆయన్ని తొట్లో కూచోనివ్వ లేదు. తానేకూచోని తోలాలంటాడు. ఆ బుడ్డాయనకు ఎద్లు నడవ్వు. బండిఆయన కొంచెం రోగిష్ఠివాడు. ఆయన నడవ లేడు. దొరసాని బండిలో కూచుందికనుక ఈయన తడికమీద కూచోటానికి వీల్లేదు. ఇట్లాగే ప్రొద్దుకూకేదాకా సాగింది. నేను ఎడ్లతలతాళ్లు పుచ్చుకోని లాగితేనేకాని ఎడ్లునడవ్వు. నేను తలతాళ్ళు పుచ్చుకుంటే దొరసానిగారి ఆచారానికి పనికిరాదు. "సరే, నేను స్నానం చేస్తాను లేరా. బండి ఎట్లాగో అట్లాసాగే టట్టు చూడ"మంది. నేను దొరను కొంచెంసేపు బ్రతిమిలాడేను. ఆయన చివరకు పోయి తల్లి దగ్గర కూచున్నాడు. బండీఆయన తొట్లో ఎక్కేడు. బండీసాగింది. రాత్రిప్రొద్దుపోయేవరకు మొన్న రాత్రి నేను పడుకున్న ఊరు వెళ్ళాం. మాదొరసాని పిల్లలకోసం అన్నం మూటకట్టుకొచ్చింది. ఆ చెరువులో రేవుదగ్గర పిల్లల కన్నం పెట్టింది. కాని మజ్జిగలేదు. నే నా బ్రాహ్మణ అమ్మ వారింటి కెళ్లి మాదొరసానిగారినీ పిల్లలనూ తీసికోవెళ్తున్నానని, వారు వచ్చారనీ, చెరువుదగ్గర మాదొరసాని పిల్లలకు అన్నం పెడుతోందనీ, మజ్జిగ కావాలనీ చెప్పేను. ఆవిడ "అదేమిట్రా,

(౮)

మీ కిదిపరాయిఇల్లా?. మొన్న మావాకిట్లో పడుకున్నావు, నేను పెట్టిన అన్నం తిన్నావు, బండి చెట్టుక్రింద దింపేవా? ఛీ, ఛీ! మొన్న నీకు తెలియక అన్నం పెట్టేను. నా అన్నం తిన్నవాడె వడూ యిల్లా చేయలే”దంది. “తల్లీ, నీ అన్నం నేను తినలేదు. నేను ప్రతిజ్ఞ పట్టేను. అందుచేత తినలేదు. నీ అన్నం తినని తప్పు యివ్వాళ తెలిసింది. ఇవ్వాళ పెట్టు. తింటా” నన్నాను. మేమం దరం వారింటికి వెళ్ళేము. ఆవిడ బండివాడికీ, నాకూ అన్నం పెట్టింది. మా దొరసాని స్నానంచేసి, ఫలహారం చెయ్యందీ వదలిపెట్టందే. మా దొర లిద్దరూ వస్తూనే నిద్రపోయినారు. ఆ బ్రాహ్మణ అమ్మవారు మా దొరసానితో “మీ ఆయన ఎంత దాత అనుకున్నావమ్మా, నా కొడుకు పెళ్ళికి మావారు మీ ఊరు యాచనకు వచ్చారు. మీ వారిని చూశారట. ఆ సమ యంలో మీవారు ఒకరాశిగా పోసి మాడలు లెక్కపెడుతు న్నారట. మావారు నా కొడుకుపెళ్ళి అని అనకముందే రెండు దోసెళ్ళు తీసి ఒళ్ళో పోశారట. మావారు ఊళ్ళో లేరు.ఉంటే మిమ్ములను క్రింద కూర్చోనిచ్చేవారా? మా ఇంట్లో మీ కథ చెప్పుకోని రోజే ఉండదు. మీ కివ్వాళ ఆదరించి అన్నం పెడు తున్నానంటే నా మంచితనం ఏమీ కాదు. మీ ఋణం వెయ్యి జన్మాలిచ్చినా తీర్చుకోలేము” అంది. అందరూ నిద్రపోయి నారు.

మరునాడు భోజనం చెయ్యకుండా ఆ మహాతల్లి మమ్ము లను పోనియ్యలేదు. బండివాడు తనకు బాడుగ నష్టమని మొదలు పెట్టేడు. నాకు కోపంవచ్చింది. "ఛీ! నీ కంత కష్టం అయితే నీ బండి తోలుకోపో. ఈ ఊళ్ళో యింకో బండి కుదురుస్తా" నన్నాను. ఆయన మళ్ళీ సర్దుకున్నాడు. భోజనంచేసి బండికట్టే ము. దారి కటూయిటూ కొతిమేరచేలు, శనగచేలు, గాలి కమ్మగా వస్తోంది. పైరగాలి పరవళ్ళు త్రొక్కుతోంది. పాలపిట్ట లెగురుతూ కూస్తున్నవి. ఒక నక్క తనజల్లితోక మళ్ళించి పొట్ట మీదికి త్రిప్పుకొని కోనమూతి ఆకాశంవైపు త్రిప్పి, దారికి ఎదు రుగా, దూరంగా, సరిగ్గా నడిమిగా కూచోని బండి గంటల మోత విని ఎడమనుండి కుడికి తిర్చింది. మా దొరలకు "అదిగో నక్క బాబూ" అని చూపించాను. పెద్దఆయన బండి దూకి నడుస్తా నన్నాడు. కొంతదూరం పోయేటప్పటికి ప్రొద్దుకూక వస్తోంది. సాయంకాలపు ప్రొద్దు యిట్టె కుంకుతుంది. నాకు సూర్యుడిమీద మహాకోపం వచ్చింది. పట్టపగలు ఊళ్లోకి వెళ్ళ కుండా ఈయన కేమి చుప్పనాత్తనం, మొగం ముడుచుకుంటా డని. అన్నీ అంత అందంగా వస్తవి. మా ఊరు రెండుకోసు లుందనగా ఒక ఊరు వచ్చాము. ఆ ఊళ్ళో ఒక ముసలిబ్రా హ్మడు ఏవూరని అడిగేడు. మా ఊరుపేరు చెప్పి మాదొరపేరు చెప్పేను. ఆవిడ మాదొరసాని, వారిద్దరూ పిల్లలు అని చెప్పేను.

ఆయన మాబండీ పోనిచ్చాడు కాదు. ఈరోజురాత్రి మాయిం ట్లో ఉండిపోవలసిందే నన్నాడు. బండీ కదలనిచ్చాడు కాదు. తప్పనిసరి కారాత్రి అక్కడే ఉన్నాము. మరునాడు ప్రొద్దున బండీ కట్టేము. ఆయన మా దొరలకు చొక్కాగుడ్డ లిచ్చాడు. బండి పగలుఝాముప్రొద్దు ఎక్కినతర్వాత కోసఎండలో పట్టెళ్ళ అద్దాలమీదపడి పదునుపెట్టిన బల్లెములు విసరుతూంటే పట్టెడ గంటలూ మువ్వలూ ఈలపిట్టల పాటలకు తాళాలు వేస్తుంటే అందరూ తలెత్తి చూస్తుంటే ఊళ్ళో ప్రవేశించాము.

* * *

పదిరోజలు పరాయిస్థలములో ఉండివస్తే మన ఇల్లే మనకు క్రొత్తగా ఉంటుంది. ఆక్రొత్తలో ఒక ప్రియత్వం ఉన్నది. ఈప్రియత్వం ఉభయత్రానూ. ఇల్లువంటిదేఊరున్నూ. స్నేహము ప్రవాసాశ్రయమువలన నశించి పోతుం దన్న భర్తృ హారిమాట సర్వదా నిజముకాదు. సర్వలక్షుమ్మగారి సంసారం మీద ఊరికి క్రొత్తఅభిమానం పుట్టింది. చెప్పినట్లుగానే వల్లడు పుట్టెడుజొన్నలూ తీసికొని వచ్చేడు; అక్కడినుంచి సర్వలక్షుమ్మ గారి ప్రతిభ కనిపించటం మొదలుపెట్టింది. ఆవిడ తనగొడ్లనన్నిం టినీ రాయప్పగారి దొడ్లోంచి ఊడతీయించి తెప్పించి తన దొడ్లో కట్టేయించింది. తన పాలేళ్ళను విడిగా తాను పిలిపించింది. ఒక రోజున పాలేళ్లందరినీ వేంటతీసుకొని రాయప్పగారింటికి వెళ్ళింది.

ఏకళ్లం ఊడిచిపోసిన రాశిలో వల్లడు పాలేరుభాగం తీయ బోతూంటే రాయప్పగారు తీయనివ్వలేదో ఆరాశిజొన్నలు బస్తాలకు పట్టించి రాయప్పగారి సావట్లో గడమంచీల మీదవేసి వున్నవి. సర్వాలక్షుమ్మగారు ఆబస్తాలన్నీ తన పాలేళ్ళచేత తన ఇంటికి పట్టింపించింది. రాయప్పగారి భార్య తిట్టటం మొదలు పెట్టింది. సర్వాలక్షుమ్మగారు "అత్తా, మామగారికి మతిపోతే నీకుగూడా పోయిందా?" అన్నది. ఆవిడమళ్లీ మాటాడలేదు. రాయప్పగారు చూస్తూ ఊరుకున్నాడుగాని కుయిక్కుమన లేదు. అంతటితో వ్యవహారం పొసగిందని ఊరంతా అను కున్నారు. వల్లడు సర్వాలక్షుమ్మగారితో "అమ్మా, ఇంక ఫర వాలేదు" అన్నాడు. సర్వాలక్షుమ్మగారు నవ్వింది. వల్లడన్నాడు కదా: "ఏమమ్మా నవ్వుతావు?" సర్వాలక్షుమ్మగా రన్నది. "ఒరేయి, నే నాడదానిని. మామగారు నా కడ్డంరాడు. అడ్డం వస్తే ఊళ్లోవాళ్లందరూ నవ్వుతారని. రేపు నీవు అరకకట్టు. అప్పుడు తెలుస్తుంది." అన్నది.

మళ్ళీ వల్లడు చెపుతున్నాడు:

మా దొరసాని అన్నంతా అయింది. నేను అరకకట్టేను. రాయప్పగారు తన పాలేళ్ళు, తాను, ఊరిలో మరికొంత మద్ద తుతో వచ్చి అటకాయించాడు. 'ఈ పొలం నీదికాదు' అని.

ఈ లోపుగా ఏమి చేశాడో వాళ్ళందరూ కఱ్ఱలతో వచ్చేరు. నేను జాగ్రత్తపడి వెళ్ళలేదు. నేనూ, యానాది గంగడూ కఱ్ఱలు పుచ్చుకొని నిలుచుంటే, అంతమందీ ఆగేదిలేదు. కాని కఱ్ఱలతో ఎంతసేపు వ్యవహారం నిలవ త్రొక్కగలను? ఎప్పటికప్పుడు మేము కొద్దిమందిమిఉంటే వాళ్ళు, వాళ్ళు కొద్దిమంది ఉంటే మేము పై చేయిగా ఉండటమేకదా. అందుచేత నేను మెత్తని మార్గం పట్టేను. "దొరా, నా దొరసాని వచ్చింది. తన పొలం నన్ను దున్నమంది. నేను దున్నుతున్నాను. దొరసానితో వెళ్ళి మాట్లాడు. నన్ను అటకాయించి ఏమిలాభం ?" అన్నాను. ఆయన "ఈ దొంగ మాటలు నా దగ్గిర కాదు. నేను నాగళ్ళు ఊడతీస్తాను. నీవు పోయి మీ దొరసానితో చెప్పుకో" అన్నాడు. నేను మా పదిమంది పాలేళ్లలో ఒకణ్ణిపిలిచి నీవు పోయి మునసబు కరణాల్ని, నాయకుణ్ణి పిలచుక రమ్మన్నాను. కాని వారెవ్వరూ రాలేదు. నేను రాయప్పగారితో "దొరా మీరు ఊడతీయండి, నేను అరక సాగించేదే నిజం" అనిచాలు మొదలుపెట్టేను. వాళ్లు పదిమందీ వచ్చి పదినాగళ్లూ ఊడతీశారు నేను ఏమీ చెయ్యాలి? ఆయనతో ఇట్లా అన్నా: ఊడతీయగానే అయిపోలేదు. నే నానాడు చేసిన ప్రతిజ్ఞ అలానే ఉంది. మా దొరసాని ఆడది. పిల్లలు పిల్లలు అనేకదా నీధిలాసా." అని ఎక్కడలేని కోపం తెచ్చుకొని "నాగళ్ళ కడ్డం తగులుతావా?

ఇది నీసొమ్మా? పలుపులు పగ్గాలు కోస్తావా?" అని పలుపులూ పగ్గాలూ కొడవలుచ్చుకుని ముక్కలు చేశాను. "మేడికోలలు విరక్కొడతావా?" అని మేడికోలలన్నీ నేనే ముక్కలు చేశాను. "కఱ్ఱులు లాగేస్తావా?" అని కఱ్ఱులు బలవంతంగా గొడ్డళ్ళతో పెకలించాను. దొరా అప్పుడు నే నాడిన నాటకం చూడాలి. చెపితే ఏముంది? లేకపోతే ఆ కోపం ఎల్లా చూపించానో ఆయన చెయ్యాని పనులన్నీ ఆయనే చేసినట్లు చూచే వాళ్ళందరికీ అనిపించేటట్లుగా నాటకమాడేను. అది ఒక చమత్కారం. సరే, ఆ కోసిన పలుపులు, పగ్గాలు, విరిగిన మేడికోలలు, పెల్లగించిన కఱ్ఱులు అన్నీ మూటకట్టి ఎడ్ల నింటికి తోలుకెళ్ళమని ఒకరిని పంపించి, అవన్నీ తక్కిన ఎనమండుగురు పాలేళ్ళ భుజానా పెట్టి బయలుదేరి వెడుతూ రాయప్పగారితో ఇలా అన్నాను: "ఇదిగో, పిల్లల నోట్లో మన్ను కొట్టాలని చూస్తున్నావు. ఇంత ఆస్తీ కాజేయాలని చూస్తున్నావు. పైన దేవుడున్నాడు. నేను పోయి ఠాణాలో చెప్తాను. రేపు ఠాణేదారును తీసుకోవస్తాను. నీ మునసబు కరణాలు ఎట్లా అబద్ధం చెప్తారో చూస్తాను. పెళ్ళాలు, బిడ్డలు కలవాళ్ళేకదా" అని దారివెంట పోయి నంతమేరా, ఆయన కనిపించినంత మేరా ఈమాట లంటూనే వెళ్ళేను. మాఊరికి ఠాణా మూడామడలో ఉంది. ఆ ఎనమండుగురు పాలేళ్ళు, నేను తొమ్మండుగురము

ఠాణాకు చేరేటప్పటికి ప్రొద్దు తిరిగింది. ఠాణాకు వెళ్ళేను. ఎనమందుగురితో చెప్పేను. "ఒరేయి, ఠాణేదారుగారు కనపడ టంతోటే అందరూ ఏడవాలిరా" అని. ఠాణేదారుగారి యెదుట ఈ ముక్కలన్నీ పడవేసి "దొరా. రక్షించాలి. రాయప్పగారు నా దొరఆస్తి అంతా తినెయ్యాలని కూర్చు న్నాడు. నా దొరసాని ఆడది. ఇల్లు కదలలేదు. పిల్లలకు ముక్కుపచ్చ లారలేదు. తల్లినీ బిడ్డలనూ ఆరునెలలు తరిమి వేశాడు. పుట్టింట సాగక మళ్ళీ పిల్లలను తీసుకోవచ్చింది. ఊళ్ళో చాకిరీ చేసేవాళ్లెవరూ మాటవినకుండా చేశాడు. మున సబు కరణాలను తన వైపు కట్టుకున్నాడు. చాకలివాడు గుడ్డలు ఉతకడు. కుమ్మరి కుండలు తీసుకోరాడు, సాలె వాడు గుడ్డనేయడు. మాందిగవాడు చెప్పులు కుట్టడు. పిల్లల తలలు మాసిఉన్నై. మంగలికి కబురంపిస్తే మొగం దాట వేస్తాడు. ఇవ్వాళ ప్రొద్దున మేము అరకలు కడితే ఇదిగో, బాబూ, పగ్గాలూ, పలుపులూ కోశాడు. నాగళ్ళు విరకొట్టేడు. ఆ దొర కుటుంబంతోపాటు ఆ చెల్లు నాదరువు చేసు కున్న పది కుటుంబాలవాళ్ళం మేము. మా దొర పోయి పణ్ణార్థం అయింది. ఇన్నాళ్లూ గంజికి మొగం వాచిఉన్నాము. పొలాలన్నీ ఆ లెక్కలు మీ కాగితాలల్లో వ్రాసిఉన్నై, కాని మా దొర ఇంట్లో లేవు. పాలిస్తారో, మీ కాగితాలు

కూడా మారుస్తారో, పాలించండి” అని తొమ్మండుగురమూ చూచేవాళ్ళ పేగులు తరుక్కోపోయేలాగు ఏడిచాము. ఆ ఠాణే దారు మా దొర ఇంట్లో ఎట్టిని జొన్నన్నంలో గడ్డంటి గేదెపెరుగు పోసుకుని, వగ్రని గోంగూరపచ్చడి నంచుకుంటూ ఎన్నిసార్లు తిని[త్రే]చాడో ఆయనకే తెలియదు. వారు నియోగులు. ఆకాలంలో నియోగులందరికీ తగరపురేకుల చెప్పులంటే చాలా సరదా. అలాంటి జోళ్లు ఏటేటా మా దొర దగ్గర ఆయన తీసుకుపోతూండేవాడు. అందుచేత ఆయనకు మా దొరంటే అభిమానం. ఆయన ముఖం కొంత అనుకూలంగా ఉందని గ్రహించి నే నీసంగతులుకూడా చెప్పేను. “బాబూ, మీకు మాదొర ఎన్నిచెప్పుల జోళ్లు ఇచ్చాడు. మీరువస్తే మాదొరఇంట్లో చుట్టాలకన్న ఎక్కువగా చూచాడు మిమ్మల్ని. ఆదొరఆస్తి యిల్లాగు కానిస్తారా ఇవ్వేళ? ఇన్ని కుటుంబాల ఉసురూ రాయప్పగారు పోసుకుంటున్నాడు. మీరు న్యాయం చేస్తానంటే మేము తిరిగిపోతాం. లేకపోతే మా పెళ్లాంబిడ్డలక్కడచస్తారు,మేమిక్కడచస్తాం.”ఠాణేదారుగారిదం తావిన్నాడు. “ఒకేయి వల్లా, నేను నిన్నెరుగనా, నీదొరనెరుగనా? కాని వ్యవహారం కొంచెం ముదిరింది. నీవు పోయి జమీందారుగారితోకూడా చెప్పి వారినికూడా తీసికొవస్తేకాని

ఇది పొసగదు. ఇప్పుడు రాయప్ప బలవంతుడై ఉన్నాడు. మా లెఖ్ఖల్లో మీ ఆస్తి పంపుళ్లై విడకొట్టి వ్రాసిలేదు. మీ దొర ఉన్నన్నాళ్లు భరోసామీద నడిచింది, పంపకంకాని ఆస్తి. ఇది ఇది అని ఎట్లా? జమీందారుగారు వస్తేకాని మీ పంపకాలు తేలవు. కరణం మసాదుచేశాడా? ఎన్నాళ్ళయింది? ఇవన్నీ ఊళ్ళోఉన్న సాక్ష్యంమీద తేలాలి. మీ ఊళ్ళో పంచాయితీదార్లేమంటారో? రాయప్ప కరణం మునసబుల్ని పట్టుకున్నా డంటున్నావు. వ్యవహారం చిక్కుల్లో పడ్డది. మీ దొర కూడా ఆయన పెద్దవాడని అంతా ఆయనపేరుగా నడిపేడు. నాకేమీ తోచకుండా ఉంది. ఇదివర కన్ని శిస్తులూ రాయప్ప కట్టినట్లుంది. వ్యవహరించింది మీ దొరే. కాయితం దాఖలా రాయప్ప కనుకూలంగా ఉంది. నీవుపోయి జమీందారుగారితో చెప్పుకుంటేనేకాని ఇది కుదరదు. జమీందారుగారు ఫలానా రోజున మీఊరు వస్తే నేనూ వస్తాను" అన్నాడు. దొరా, నీకు ఈ మాటలన్నీ క్రొత్తగా ఉండవచ్చు. ఇవన్నీ ఇంగ్లీషువారు ఈ గడ్డలో వచ్చి ఎవడు వ్యవసాయం చేస్తున్నా పొలం వాడిదీ అని నియామకంచేసి కాగితాలు పుట్టించని రోజుమాటలు. అప్పటికి దేశంలో యిల్లా ఉండేది. ఎవడు అరకకట్టి దున్నితే వాడిది ఆపొలం. ఎవడిపేర తహసీలు చెల్లించిఉంటే వాడిది ఆ పొలం. రైతులదగ్గర కాగితా లుండేవికాదు, అంతా పంచా

యితీదార్ల మీద ఉండేది. నీకు కావలసివస్తే బంజరుగా ఉన్న పొలం దున్నుకో. ఒద్దనేవారు లేరు. నీవు వరసగా దున్నుకుంటూ ఉన్నన్నాళ్ళూ ఆపొలం నీది. నీవు దున్నిన పొలంమీద నీపంటలో ఆరవవంతు జమీందారు తీసికొనేవాడు. కావలసినంత బంజరు ఉండేది. క్రొత్తగా అరక కట్టినవాడికి పొలం లేకపోలేదు. ఇది ఆనాటి వ్యవహారం. అప్పుడు నేనన్నానుకదా - "బాబూ, నేను జమీందారుగారి దగ్గరకు పోతాను. ఈలోపుగా రాయప్ప గారు మీదగ్గరకు వస్తాడేమో" అని అంటూఉండగా ఠాణేదారు "రానీ, తప్పుడు ముండాకొడుకుని. పది కుటుంబాలనోట్లో గడ్డకొడతాడా? అందులో నీదొరనా? నీదొరే నీఇట్లాంటివాడైతే రాయప్పను సాదిలోకి రాకుండా చేసేవాడు. వశంలో పెద్దవాడని అట్టి పెట్టిన గోప్యం ఉంచుకోలేక పోయినాడు. నీవు పో" అన్నాడు. నేను మనస్సులో సంతోషించాను. ప్రభువుదర్శనం ఎల్లాఅవుతుంది? సరే మేము పదిమంది పాలేళ్లం ఈమేడికోళ్ల పుల్లలూ, ఈ తెగకోసిన పలుపులూ, ఈకఱ్ఱముక్కలూ పది మందిమీ పదికట్టలు నెత్తిన పెట్టుకొని నూజివీడు వెళ్లేం. ప్రభువు దర్శనం ఎవరికీకాదు. మేము దేవిడీముందర మాబరువులు దింపుకొని ఏడవటం మొత్తుకోటం, ప్రభువుదర్శనం కావాలంటం! ఎవ్వరూ మమ్ములను పాలించినవాళ్ళు లేరు. నాలుగు రోజులు గడచింది, ఏమి చెయ్యాలో తెలియట్లేదు, చివరకొక

బంట్రోతు ప్రభువు ఆరోజు సాయంత్రం అందరకూ దర్శనం యిస్తారని చెప్పేడు. ఆదర్శనం ఇస్తాడన్నచోట పోయి నిలుచున్నాము. ప్రభువు నిజంగా ప్రభువు. పెద్దపెద్ద దొరలందరూ వచ్చిఉంటే మొట్టమొదట మావంక చూచాడు. చూడటంతోటే నేను వెంటనే మాట్లాడేను. నాగోడంతా మొదలుపెట్టి చెప్పేను. వారు పలుకరిస్తారని ఎదురు చూడకూడదు. ఆ చూపు ఇంకొకరివైపు మళ్లిందా మన పని మాసాలుపట్టిందే. నేను మొదలు పెట్టటంతోటే "అయ్యా, నేను ఫలానా దొర పాలేరును" అన్నాను. ప్రభువుకన్నులు పెద్దవైనవి. అవటంతోటే నేను గ్రహించాను. మాదొర పేరు ప్రభువుకికూడా తెలుసునని. పదిముక్కల్లో అంతా చెప్పేను. "దొరా, నా యజమానీ రాయప్పగారూ తాతాసహోదరులు. నాయజమానిది పెద్దకుదురు. రాయప్పగారు వయస్సుచేత పెద్దవాడు. నాయజమాని పెద్దవాడుకదా అని రాయప్పగారిమీద మర్యాదపెట్టి వ్యవహరించాడు. రాయప్పగారు నాయజమాని పోయినాడని ఆయనభార్యనీ పిల్లలనూ ఊళ్లోంచి వెళ్ళగొట్టి ఆ స్త్రిఅంతా తాను కాజెయ్యాలని చేస్తున్నాడు. మేము పదిమంది పాలేళ్లం ఇంకా గొడ్లను కాచేవాళ్లూ వాళ్లూ మూడుకుటుంబా లున్నాయి. మా యజమాని కుటుంబంతో పదునాలుగు కుటుంబాలం. మా యజమానికి రాయప్పగారికీ పంపకాలైనవి. లెఖ్ఖల్లో లేవు.

ప్రభువులు వచ్చి మా యజమాని పిల్లలను దయచూస్తే మేమందరం బ్రతుకుతాం. ఆయన ఊరంతా ఆకట్టేడు. పంచాయితీదార్లు రాయప్పగారి వేపున ఉన్నారు. ప్రభువు లక్కడ నిలుచుంటేనే గాని నిజం బయటకురాదు. అంతా చీకటిగా ఉంది. దొరలు ప్రొద్దుపొడిస్తేనే గాని ఏది ఏదో కనిపించదు." అన్నాను.

దొరా చూచావా, ఇక్కడ నిన్ను దొర అంటాను. అక్కడ నిన్ను నా యజమాని అన్నాను. అక్కడ ప్రభువునీ దొరఅని నిన్నూ దొర అనకూడదు. అందుచేత అల్లా చెప్పేను. నేర్చుకో అన్నాడట మా నాయనతో వల్లడు.

ప్రభువు శ్రీనోటి వెంట ఒక్కటే మాట వచ్చింది. "మేము శుద్ధపాడ్యమినాడు మీఊరు వస్తాము." అనటంతోటే ప్రభువుచూపు వేరేవైపుకి మళ్లింది. ఇంక అక్కడనిలుచుంటే తప్పు. వెంటనే నేను తక్కిన వాళ్ళందరినీ మళ్ళించుకొని వచ్చేశాను. మేము ఎక్కడికి వెళ్ళామో నేను ఏమిచేశానో ఊళ్లో ఎవ్వరికీ తెలియదు. నేను తెలియనీయలేదు. నేను తాణాకు వెళ్ళినట్లు తాణేదారు చెప్పితే నేనేమి చెయ్యను? లెఖ్ఖలన్నీ రాయప్పగారి కనుకూలంగా ఉన్నవి అన్నట్లు వదంతి పుట్టించాను. ఎడ్లని రాయప్పగారి సావిట్లో కట్టేయించాను. మా

దొరసాని రాయప్పగారింట్లో నించి తెచ్చినజొన్నల రాసి బస్తాలు మేము పదిమందీ తీసికెళ్లి రాయప్పగారింట్లో వేశాము, శుద్ధపాడ్యమినాడు మా దొరసానీ, పిల్లలూ మళ్ళీ పుట్టింటికి వెళ్తారని మేము పదిమందిమీ ఎక్కడ పడితే అక్కడ చెప్ప మొదలు పెట్టాము, దీనివల్ల ఊళ్లో ఒక మార్పు కలిగింది. అదివరకు ఎదురుగా వుండేవాళ్లకు కూడా జాలిపుట్టింది. నేనంటే అక్కడక్కడ కొంచెం లోకువ కూడా అయింది. "వీడేమో పెద్ద అట్టాచేస్తాను, ఇట్టాచేస్తాను అన్నాడు. కాగితాలన్నీ రాయప్పగారి వైపునే ఉన్నవిట" అని కొందరు, "ఉంటే మాత్రమిమేమి? ఆయనపిల్లలను అన్యాయం చేస్తాడా" అని మరి కొందరు. "కాగితాలెట్లా ఉంటే నేమి, పంపకా లయినయ్యా లేదా. పంపకాలైతే పిల్లలాస్తి పిల్లలదేను" అని అందరూను. నేను ఒకరోజున ఠాణాకు పోయి ఠాణేదారు గారితో చెప్పేను. ఆయన "ఒరేయి వల్లా, నీవు నీ దొరంతవాడవురా. ఈ సాహసం నీదొర దగ్గర ఉండేది. ఇదంతా చేసిన తరవాత తేలిక అనిపిస్తుంది.ఏమున్న దనిపిస్తుంది. ప్రభువు దర్శనం కావటం, దొర నీ వంక చూడటం, చూడటంతోటే నీవు నాల్గుముక్కల్లో అంత పొసగేటట్టు చెప్పటం, ప్రభువు కన్నటు త్రిప్పటంతోటే ఇటు లేచిరావటం, ఇది ఎవరో మా నియోగిబిడ్డలు చేయవలసినపని. మాలోకూడా రాజ

సభల్లో మెదిగేవాడికి తెలిసేదికాని ఇంకోడికి తెలియదు" అన్నాడు. నేను "స్వామీ, అంతమాట లెందుకు? శుద్ధపాడ్యమికి తమరు మాఊరు దయచెయ్యాలి. ఈలోపుగా నాదొక్క మనవి. ప్రభువులు తమరు ఒక్కసారి అక్కడకు రావాలి. నేను ఊరంతా మైకంలో పెట్టాను. నేనందరూ చచ్చిపోయినా నను కుంటున్నారు. ఆరోజున చచ్చిపోలేదని చూపిస్తాను. వాళ్ళందరూ నివ్వెరపోతారు. ఆనివ్వెరలో విచ్చిన వాళ్ళ కళ్ళవెలుగుల్లో ప్రభువుల దయ అనే చకిముకిరాయి పెట్టి నా దొర ఇంట దీపం వెలిగిస్తాను" అన్నాను. ఠాణేదారు నావంక నిదానించి చూచాడు. నేను శలవ తీసుకుంటూ నన్నాను. ఆయన "ఒరేయి ఇక్కడెందుకు పుట్టేవురా?" అన్నాడు. నేను ఆయన పాదాల దగ్గిర తలమోపి ఇంటికి వచ్చాను. ఇంటికి వెళ్ళి మా దొర పొలం రాళ్ళన్నీ పంపకంనాటి ప్రకారంగా అన్నీ సరిచూచాను. అమాస్యనాడు రాత్రి ఒక నాగలీ తీసుకోపోయి ఎవ్వరికీ తెలియకుండా మాదొరపొలం ఎక్కడెక్కడ తెగకొట్టుకున్నారో అదంతా బద్దింపుగా చాళ్ళుతీశాను. మరునాడు ప్రొద్దున్నే మునసబుగారింటికు వెళ్ళేను. మునసబుగారు మొగం కడుక్కుంటున్నాడు. 'ఆపద కడవం బెట్టను' అన్న పద్యం చదివేను. ఆయన 'ఏమిరా' అన్నాడు. "దొరా, నిజంమీదనిలవాలి. ఇవ్వాళ నీవు నిలబెడితే నాదొరలు నిలుస్తారు. ప్రొద్దెక్కేటప్పటికి తెలుస్తుంది. నీపాడి

ఆవుకి నేను మందుపోశాను" అన్నాను, వెళ్ళాను. గంగడితో నాయకుడి దగ్గరకు వెళ్లేను. నాయకుడితో అన్నాను: "నీతాత వాడుకున్న చెంబు నీ కెల్లాంటిదో నా తాతలు చేసిన పాలేరుతనం నా కల్లాంటిది. మన ప్రభువులు హైదరాబాదునబాబు క్రిందివారు. వాళ్ళు ముసల్మానులు, నీవు ముసల్మాను. మధ్య ఉన్న మా ప్రభువు నామతం మంచిదో నీమతం మంచిదో ఇవ్వేళ తెలియాలి. నామతం మంచిది చేశాను. నీమతం మంచిది చేశాను. నీమతం మంచిది నీవు చెయ్యి" అన్నాను. కరణంగారి దగ్గరకు వెళ్ళాను. "దొరా, చెప్పులు మెత్తగా ఉన్నాయా" అన్నాను. ఆయన "ఉన్నైరా. ఏమిలాభం? నీవు చేస్తానన్నది చేయలేకపోతివి" అన్నాడు. ఆయనతో అంతా చెప్పాను. ఆయన "మునసబుతో కూడా చెప్పేవా" అన్నాడు. "దొరా, ఇంకొకడికి చెపుతానా? నీవునియోగివి, అందుకని చెప్పే" నన్నాను.

మా నాన్న చెప్పినది.

ఆ మధ్యాహ్నం జమీందారు వచ్చేడు. అంతా అరగడియ పట్టలేదట. వ్యతిరేకంగా ఎవ్వడూ ఊళ్ళో సాక్ష్యం ఇవ్వలేదట. రాయప్పగారు ప్రతిదానికి 'నిజమే, నిజమే' నన్నాడుట అంతా ఊరికరణం కలిపించుకొని ప్రభువుముందరనే లెక్కలన్నీ

మా నాయనమ్మ పేర వ్రాశాడట. ఇప్పటికీ లెఖ్ఖలన్నీ బామ్మ పేరే ఉన్నవి. ఆమరునాడు ఊరంతా అట్టుడికినట్టు ఉడికిపోయిందట. పదిమంది పాలేళ్ళూ పోయి మళ్ళీ జొన్నలబస్తాలింటికి తెచ్చారట. పదిజతల ఎడ్లనీ మళ్ళీ తీసుకొచ్చి మా సావట్లో కట్టివేశారట. రాయప్పగారు మాటాడలేదట. వల్లణ్ణి చూస్తే రాయప్పగారికి వాడు చచ్చిపోయేవరకూ భయమే. తరువాత పదిరోజులకు బామ్మ వెళ్ళి రాయప్పగారిని మా తాతయ్య అబ్దీకానికి భోజనానికి పిలిచిందట. ఆయన "వస్తానులే వస్తాను. ఎందుకు రాను" అన్నాడట.

ఈ కథంతా మా నాయనగారు ఆరోజున రాత్రి నాకు చెప్పేడు. నాకు తెల్లవార్లూ నిద్ర పట్టలేదు. మరునాడు ప్రొద్దున్నే వాకిట్లో కూచున్నాను. వల్లడు మళ్ళీ కేకలువేస్తూ వచ్చాడు. వాణ్ణి చూట్టంతోనే 'వల్లా' అని పిలిచి నేను ఏడవటం మొదలెట్టాను. వాడు నిన్నటికీ నేటికీ భేదం చూచాడు. గ్రహించాడు. వాడి తెలివిముందర నే నెంత? ఇంతలో మా నాన్న వచ్చాడు. "ఏమయ్యా, కుఱ్ఱాయనకు చెప్పేవా ఏమి నాకథంతా? బలే తెలివిగలవాడవు! కుఱ్ఱాయన కేమి తెలుసు" అని, నా వంక చూచి "అవన్నీ ఒట్టిమాటలు బాబూ. మీనాయన అంతేలే. అన్నీ కలిపించి చెప్తాడు. బాబుగా. ఏడవకు" అని

(10)

అదో౯క విసురు తెచ్చుకొని "ఏడిస్తే పొలం ఎల్లా చేస్తావ్ ?లే, లే" అన్నాడు.

మళ్ళీ నేనుస్కూలికి వెళ్ళాను. నమ్మండి, నమ్మకపొండి, వల్లప్ప అని ఎక్కిరించినవాళ్ళకి నలుగురికీ ఫెడేలు ఫెడేలుమని లెంపకాయలు పేలినై. మళ్ళీ నన్నన్నవాడు లేడు. నేను అప్పటినుంచీ మా పాలేరుకుమల్లే వీరవల్లణ్ణి అయినాను; చెప్పలేదు కాబోలు. మా ఊళ్లో అందరూ మా పాలేర్ని వీరవల్లడనే వాళ్ళుట. అదీ.

సమాప్తము

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B149 |
| పుస్తకం పేరు | వీరవల్లడు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 5 |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |